స్వాతంత్ర్యము ! శాంతి !! అభ్యుదయము !!

# కాంగ్రెసు విజయము

( జాతీయ నాటకము—ఎన్నికల బుఱ్ఱకథ )






గ్రంథకర్తలు:
ఉభయభాషాప్రవీణ
జాస్తి వెంకటనరసయ్య
ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యము

★

ప్రచురణ:
దేశికవితా మండలి
బెజవాడ — ఘంటసాల

 వెల రు 1/-

స్వాతంత్ర్యము !  శాంతి !!  అభ్యుదయము !!!

# కాంగ్రెసు విజయము

( జాతీయ నాటకము—ఎన్నికల బుఱ్ఱకథ )



★

గ్రంథకర్తలు:
ఉభయభాషాప్రవీణ
జాస్తి వెంకటనరసయ్య
ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యము



వెల రు 1/-

# — పాత్రలు —

## పురుషులు

| | | |
|---|---|---|
| జవహర్లాలు నెహ్రూ | అజాద్ | పనుసుస్వామిపిళ్లే |
| బ్రూక్స్-గురువు | రాజేంద్రుడు | ఆచార్యరంగా |
| మోతీలాలు | ఇర్విన్ | చంద్రమౌళి |
| హెరాల్డులాస్కీ | హోం మెంబరు | సుబ్బారావు |
| ఖాన్ సాహెబ్ | కమాండర్ ఇన్ చీఫ్ | కోటిరెడ్డి |
| ప్రకాశం పంతులు | జమీందారు | ట్రూమన్ |
| గాంధీజీ | ,, గుమాస్తా | లాస్కీ |
| పటేలు | గిరి - గోపాలరెడ్డి | స్టాలిన్ |
| పట్టాభి | యాకూబ్ | జంగ్ కై షేక్ |

## లు

| | | |
|---|---|---|
| కమలా నెహ్రూ | లక్ష్మీబాయమ్మ | సరోజిని |
| విజయలక్ష్మి | భారతీరంగా | మరికొందఱు |

## జాతీయ పండుగలు

జనవరి 1 ఆచార్య రంగా జన్మదినము. 23 నేతాజీ బోస్ జన్మదినం. 26 స్వతంత్ర దినోత్సవం. మార్చి 2 కస్తూరిబా స్మారకదినం. ఏప్రిల్ 6-13 జాతీయవారం. మే 1 కార్మిక దినోత్సవం. జూన్ 4 ఆంధ్రరత్న వర్ధంతి. ఆగస్టు 1 తిలక్ వర్ధంతి. 9 వీరసంస్మరణదినం. 21 క్విట్ ఆసియా దినోత్సవం. సెప్టెంబరు 1 రైతు జయంతి. అక్టోబరు 2 గాంధి జయంతి. 21 అజాద్ హింద్ ప్రభుత్వ జయంతి. 30 పటేల్ జయంతి. నవంబర్ 14 నెహ్రూ జయంతి. 26 పట్టాభిజయంతి. డిశంబర్ 28 కాంగ్రెస్ జన్మదినం.

# తొలి పలుకు

**అఖిల భారత నాయకులు, కేంద్ర శాసనసభాసభ్యులు**

**ఆచార్య రంగాగారు**

1942 విప్లవారంభమువరకు శ్రీ జాస్తివారి నాటకమును తయారవుతుండగా ఒకమారు చదువగల్గితిని నాటకపు నడక, మాటలు, పద్యాలు అన్నియు ఈ నాటి విప్లవయుగపు వడిని, వేడిని, ఉత్సాహమును ప్రకటించుచున్నవి. గ్రంథకర్త దేశభక్తులు. జైలునకు పోయివచ్చిరి. గాంధీజీపంథానువర్తులు. స్వాతంత్ర్య వీరులు. స్వరాజ్య కాంక్షులు. వారే కవీశ్వరులై యుండుటయు జాతీయోద్యమపు అదృష్టము.

ఈ పుస్తకము మన స్వాతంత్ర్య సంపాదనా ప్రయత్నమును బలపరచుననే విశ్వాసము నాకు గలదు.

26-12-1945 — రంగ.

★

# పరిచయము

ఈ రచయిత లిద్దఱు దేశభాషాసేవల చేయుచున్నారు. శ్రీ ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యముగారు జాతీయాభిలాషులు. నిరాడంబర జీవనులు. ఖాజీపాలెము వాస్తవ్యులు. కర్మయోగులు. శ్రీ జాస్తి వెంకట నరసయ్యగారు మా గ్రామవాసులు. తెలుగు పండితులు. ఇద్దఱు హిందూస్థానీ నేర్చుకొనినవారు.

ఈ నాటకమందు 60 ఏండ్ల కాంగ్రెసు చరిత్ర సంగ్రహింపబడినది. ప్రతి రంగము సంవత్సరముతో చూపబడినది. 1. సంస్కరణాంకము, 2. సంపూర్ణ స్వరాజ్యాంకము, 3. ప్రజా విప్లవాంకము అను మూడంకములతో పద్యగేయములతో నొప్పుచున్నది. ఇట్టి నాటకము ఆంధ్రభాషలో లేదని చెప్పవచ్చును. ప్రచారమునకు మిక్కిలి తోడ్పడును. ఇందలి బుర్రకథ ఎన్నికలకొరకై వ్రాయబడినది. ఆంధ్రులు ఈ నాటకమును అభిమానించి చదివి ప్రదర్శించి ప్రచారమునకు దెచ్చి వీరిచే నిట్టి గ్రంథము లింకను వ్రాయించెద రని నమ్ముచున్నాను. దీనిని అనువాదము జేయదలచి యున్నారు.

ఇపుడు చిలకలూరిపేట హైస్కూలులో ఉపాధ్యాయులై యున్నారు.

పెదపూడి,
తెనాలి తాలూకా
2—1—1946

ఇట్లు,
కరణం రామకోటయ్య

# కాంగ్రెసు విజయము

## 1. సంస్కరణాంకము

(1885—1929)

### రంగము ౧ (1904_5)

ప్రదేశము : ఆనందభవనము    ప్రవేశము : జవాహర్లాలు

(విద్యార్థివేషమున, పత్రిక చదువుచు).

జవ: గీ. అరయఁగ జపాను బలమెంత? అదియునేఁడు
రష్యను బలాల ఢీకొని రణమునందు;
వేడిరక్తంబు ప్రవహించు వీరతతికి
ధర్మసంస్థాపనంబు కర్తవ్యమె కద!

ఔర! సామ్రాజ్య క్షుధ కెంత యాహార మిడినను దృప్తి నొందదుకదా!

బ్రూక్సు: (ప్రవేశించి) జవహర్! ఏదియో యాలోచించు చున్నారు?

జవ: నమస్తే! గురూజీ! దయచేయుఁడు.

బ్రూక్స్ : జవహర్! ఈ దిన మింత కోపముగ నున్నావేమి?

జవ : కోపము లేదు స్వామీ! పరధనాపహరణకాంక్షచే బలవంతుఁడు బలహీనులపైఁబడి వారిస్వేచ్ఛ నపహరించి వారిని బానిసలుగ నొనరించు రాక్షసకృత్యములు నాకు హృదయావేదన కలిగించుచున్నవి.

బ్రూక్స్ : ఓహో! రష్యనులు మంచూరియాపై యుద్ధమునకు వచ్చుటయా?

జవ : అవునుస్వామీ! తన సామ్రాజ్యతృష్ణకు పాశ్చాత్యదేశములనెల్ల కబళించిన రష్యన్ సామ్రాజ్యము, అంతటితో తనివినొందక ప్రాగ్దేశములకుగూడ నెగబ్రాక చూచుచున్నది. అట్టితఱి చెంతనున్న చైనాదేశాధీశుఁడు బలహీనుడై మిన్నకున్నను జపానువారు మాత్రము మహాధైర్యమున బోరాడి పశ్చిమదేశముల బాఱినుండి మంచూరియాను రక్షించిరి. వారి సాహస మపారము.

బ్రూక్స్ : (తనలో) ఆహా! ఈ బాలకునియం దెంతటి స్వతంత్రతావాంఛ కనుపట్టుచున్నది. ఈతఁడు గొప్పనాయకుఁడు కాఁగల లక్షణములు కనబడుచున్నవి. ఇట్టి స్వాతంత్ర్యవాంఛనే వీనియందు పెంపొందించెదగాక! (ప్రకాశముగా) జవాహర్! సామ్రాజ్యవాదము సామ్రాజ్యతృష యనుచుంటివే, అదియేమి?

జవ : గురుదేవ్! అడిగితిరిగాన చెప్పదలచితిని. ఉదారాశయులుగాన నా పలుకులకు కినియకుందురుగాక! మీ బ్రిటిషువారు మా భారతభూమిని పాలించుచున్నారుగదా! ఇది సామ్రాజ్యతృష్ణగాక మఱియేమి?

బ్రూక్స్ : అంతఃకలహములతో చీకాకుచెందిన ప్రజలనందఱి నేకముచేసి సౌకర్యముల గలిగించుట సామ్రాజ్యతృష్ణ యగునా ?

జవ : కాని, "ఎంతసుపరిపాలనమైనను, స్వపరిపాలనకు సాటి కాజాలదు" అను బ్రిటిషు లిబరల్ ప్రధాని, సర్ హెన్రీ కేంబెల్ బానర్మన్‌గారి సుభాషితమును మొన్న మీరే గద నాకు చెప్పితిరి.

బ్రూక్స్ : ఓహో ! ఎంతటి జ్ఞాపకశక్తి ! (ప్రక్కకుజూచి) అరుగో ! మీ నాయనగారు వచ్చుచున్నారు.

మోతీలాల్ : (చిఱునవ్వుతో ప్రవేశించి) ఒహో ! గురుశిష్యు లేదియో సంభాషించు కొనుచున్నారే ?

బ్రూక్స్ : ఏమియు లేదు. మనపిల్లవాఁడు మంచి చుఱుకైన వాఁడు. రాచకీయ విజ్ఞానము గ్రహించుచున్నాఁడు.

మోతీ : రాచకీయములే నేర్పుచున్నారా? అట్లైన మీకే మోసము తెచ్చునేమో. (అని నవ్వును)

బ్రూక్స్ : ఏమిజరిగినను ఉపాధ్యాయుఁడు తన శిష్యులను మాత్రము మోసగించరాదు, సత్యమును మరుగుపఱచరాదు. తన లాభమునకు వారిని బలిసీయరాదు. కోమలములగు వారి మనములయందు సత్యబీజములనే నాటవలెనుగాని, విషబీజములకు తావీయరాదు.

మోతీ : మీరు చాల ఉదారచరితులు. మీ ధార్మికతాదృష్టి స్వసంఘ శ్రేయమును గూడ నతిక్రమించి ప్రసరించు చున్నది.

జవ : బాబూ ! గురువుగారు పూజ్యులు. వారి బోధనా

జ్యోతిచే నా హృదయకుహరాంతరాళముల వెలుగు ప్రసరించు చున్నది.

బ్రూక్సు: పండిట్ జీ! ఈయేడు కాంగ్రెసు మహాసభ కాశీలో శ్రీగోపాలకృష్ణ గోఖలేగారి యధ్యక్షతను జరుగునుగదా!

మోతీ: అవును. వారు విద్యాసేవలయం దారితేరినవారు. అంతేకాదు. గత మూడు సంవత్సరములనుండి కేంద్ర శాసన సభా సభ్యులుగా నుండి ఆదాయవ్యయ చర్చల యందు ప్రభుత్వ విధానమును తన నిశిత విమర్శనాపటి మమునకు గురిచేసిన మేటి మేధావి! భారత జాతీయత మూర్తీభవించిన వ్యక్తి.

జవ: బాబు! ఈ సంవత్సరమున జరుగునది ఇరువది యొకటవ కాంగ్రెసని ప్రకటించినారే!

మోతీ: నిజము. 'కాంగ్రెసు' అను పేర అఖిలభారత జాతీయ సంస్థ 28 డిసెంబరు 1885 న ఎ. ఓ. హ్యూమ్ అను రిటైర్డు ఐ. సి. యస్. ఆంగ్లోద్యోగిచేతను, దాదాభాయి నౌరోజీ చేతను స్థాపించబడినది. నీవు 14-11-1889 న జన్మించితివి. అనగా నీ కన్న కాంగ్రెసు నాలుగేండ్లు పెద్దది.

బ్రూక్సు: నాటి వాతావరణములో అట్టి సంస్థ స్థాపించుట అవసరమే యయినది.

మోతీ: అవును. 1857 న సిపాయీల తిరుగుబాటు జరిగి నాటినుండియు ప్రజలలో స్వాతంత్ర్యవాంఛ యంకురించి నది. తదుపరి ప్రభుత్వ విధానమువలన ప్రజలలో 'అసం తృప్తి, అశాంతి ప్రబలినవి. ఆ యశాంతికారణముగా మన సంయుక్తరాష్ట్రములందు రహస్య సంఘాలు హింసా విధా నమును అతినిగూఢముగా నవలంబించినవి.

బ్రూక్స్ : దేశము సర్వవిధముల గొప్ప దశను పొందవలెనన్న దేశస్థులు విద్యావంతులుకావలెను. ఇందుకొఱకే వాల్యాం గారు పాటుబడిరి.

జవ : విద్యయనఁగా ఆంగ్లవిద్యయనియా తమయభిప్రాయము.

బ్రూక్స్ : కాదు. విజ్ఞానాభివృద్ధి కలిగించునదియే విద్య. అట్టి విద్యయే ప్రజలకవసరము. మన జవహారునట్టి ఉన్నతవిద్యకు పంపవలయును.

మోతీ : అవును, అదియే అనుకొనుచుంటిని. విదేశమునకు పంపిన విశేషవిజ్ఞానము నార్జించుట కవకాశములు మెండు కదా! అందును పాశ్చాత్యుల కార్యశూరత, సాహసము క్రమశిక్షణ అనుకరణీయములు. పై వారమున నేను కుటుంబ సహితముగా ఆంగ్లదేశ మేగి 'హారో' నగరమున పాఠశాల యందు వీనిని జేర్పించి వచ్చెదను.

బ్రూక్స్ : మంచిది. ఆ ప్రయత్నమున నుండుడు. నే నిక వెళ్ళి వచ్చెద.

మోతీ : పోదమురండు. (నిష్క్రమింతురు)

జవ : జన్మభూమిని వదలి పరదేశమునకు పోవుట కష్టముగనే యున్నది. ఆంగ్లభూమియందు ప్రజలు మద్యపానరతు లనియు, స్త్రీలు స్వేచ్ఛాసంచారిణులు అనియు వింటిని. అచట ఎట్లు మెలగుదునో! (ఆలోచించి) మోహన్‌దాస్ కరంచంద్ గాంధీగారు మహిళను, మద్యమును, మాంస మును ముట్టనని ఆంగ్లదేశము పోవునపుడు శపథము చేసె నట. నాకదియే ఆదర్శ మగుగాక !

ఉ. వినను పోదు నాంగ్లభువి కచ్చటి యున్నతవిద్యమాట యె
ట్లైనను వారిదేశములయందు వెలుంగు స్వతంత్రతాద్యుతిన్
గానగవచ్చు, ఆ పయిని కార్యవిధానము మిత్రవర్గ సం
ధానుఁడనై రచింతు వసుధాతలి భారతికీర్తి నిండగా.

★

రంగము ౨. (1910)

ప్రదేశము: లండనులో నొకగది.

ప్రవేశము: జవాహర్‌లాలు, ఖాన్‌సాహెబ్

జవ: వందేమాతరం (అని పాడుచుండును)

హెరాల్డ్‌లాస్కీ: (ప్రవేశించి) జవాహర్! ఏదియో పాడు చున్నావే? ఏదీ మరల పాడుము.

జవ: వందేమాతరం

సుజలాం సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం ॥వందే॥
శుభ్రజ్యోత్స్నాపులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుహాసినీం సుమధురభాషిణీం
సుఖదాం వరదాం మాతరం ॥వందే॥
సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం.
సస్యశ్యామలాం మాతరం ॥వందే॥

లాస్కీ: సరియే కాని మీదేశమందలి గడబిడ యేమి?

ఖాన్ : అది మీ దేశస్థుల పరిపాలనాఫలితమే స్వామీ !

లాస్కీ : కాని, మీ దేశస్థులు రాజద్రోహులయి పాలకులను హత్యలు గావించుట మిక్కిలిదోషము.

ఖాన్ : నీవు మా దేశపరిస్థితుల విచారించిన దేశములోని వారెల్ల ఇంకను ప్రభుత్వముపై తిరుగుబాటుల చేయ లేదని యడుగుదువు.

లాస్కీ : కాని నిరుడీ దేశమున జరిగిన దారుణహింసను జూచి యుంటిమికదా! బహిరంగ సభలోనే మదనలాల్ ఢీంగ్రా యను యువకుఁడు సర్ కర్జన్ వైలీని హత్యగావించెను గదా !

జవ : అవును. హత్యగావించుట దోషమే. కాని అట్టిస్థితికి వారిని తెచ్చుట మిక్కిలి దోషము. అతిభీరు వగు పిల్లి సైతము మూలకు తరుమబడి బాధింపబడినపుడు గత్యంతరము లేమి ఎదురుతిరుగుట సహజము. అందు రాజద్రోహము లేదు. అసలు రాజన నెట్టివాడు? రాజునకును ప్రజలకును సంబంధమెట్టిది?

లాస్కీ : ఓహో ! సామ్యవాదసిద్ధాంతములు చెప్పుచుంటివా? ఆ సామ్యవాదము ప్రపంచమంతట వ్యాపించిన మానవులెల్ల దేవతలగుదురు. అట్టి శుభసమయమునకేగదా మన మెదురు చూచుచుంటిమి.

ఖాన్ : తమ యధికారమును స్థిరపరచుకొనుటకే బ్రిటిషు వారు యత్నించుచున్నారు, లేకున్న బంగాళమును హిందూ ముస్లిము రాష్ట్రములుగా విభజింపనేల? హిందూ ముస్లిములు తమను వేఱుచేయవలదని నేడు ప్రతిఘటించుచున్నారు. అట్టివారిని పాలకులు తమ దమన నీతిచే నిర్మూం

ధించు చున్నారు. తుదకు విద్యార్థులనుగూడ శిక్షించు చున్నారు.

జవ: మా దేశమున స్వాతంత్ర్య సముపార్జనకు నూతన చైతన్యము ప్రజలయందు ప్రబలినది. భారతజాతీయ సంస్థ యగు కాంగ్రెసు మితవాదతత్వపూరితమై ప్రార్థనలు చేయుచున్నను, యువకులలో జాతీయభావ ముదయించి నది. ఇపుడు నేను పాడిన ఈ 'వందేమాతర' మను గీత మునే పాడినందులకు శ్రీ బాలగంగాధర తిలకు మహాశయు నకు ఆరువత్సరములు ద్వీపాంతర వాసశిక్ష, ఆంధ్ర దేశమున శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుకు మూడు వత్సర ముల కఠిన వరకము ప్రాప్తించినది.

లాస్కీ: అయిన మీ దేశమున మతవిభేదములు లేవా?

ఖాన్: చూచుచునే అట్లనెద వేల? ఇచటనున్న హిందూమహ మ్మదీయులము సోదరులవలె మెలగుట లేదా? మతములు వేరైన మానవత్వ మేల వేరగును?

జవ: అసలీ మతకలహలు ప్రభుత్వముచే ప్రేరేపింపబడుచున్నవి. మొదట 1888 లో పశ్చిమోత్తర రాష్ట్రముల గవర్నరగు సర్ ఆక్లండుకాల్విన్, కాంగ్రెసుకు మహమ్మదీయులు వ్యతి రేకు లను భావము వ్యాపింపచేయుటకు ప్రయత్నించెను. కాని వాని యాటలు సాగలేదు.

లాస్కీ: సరియే. మనము పెద్దవారమైన వెనుక విశ్వమానవ కల్యాణమునకై ప్రపంచ ప్రజాస్వామిక మేర్పరుప కృషి చేయునర్పుదము.

జవ: మంచిది. మన స్నేహము వృద్ధియగుచు నుండుగాక. ఇంక పోవుదము. (నిష్క్రమింతురు)

## రంగము 3. (1918)

ప్రదేశము : ఆనందభవనోద్యానవనము. ప్రవేశము : కమల

కమల : (కీర్తన)

భారతజాతికి ముక్తిలేదా !
బానిసత్వ మింక తొలఁగఁగఁబోదా? ॥భార॥
శుకపికసంతతి శోభల మీఱఁగ
వికవిక స్వేచ్ఛల విఱ్ఱవీఁగుగతి
సకలవిధంబుల స్వాతంత్ర్యముతో
ఇక నీదేశం బెన్నటి కలరునో ॥భార॥

జవ : ఆహా ! నా గృహలక్ష్మియు, దేశస్వాతంత్ర్యమునే వాంఛించుచున్నది. తండ్రీ ! నా మనోభావములకుఁ దగిన సతీమణిని కూర్చితివి. ధన్యుఁడను కమలా !

కమ : ఓహో ! భారతదేశపు భాగ్యదేవత లగు వీర జవాహారులా ! స్వాగతము! రండు!

జవ : కమలా ! నేఁ డింత యాలసించితి వేల ?

కమ: మఱి మా "హోంరూలు"ను నిర్వర్తించి రా వలదా?

జవ : నీవు మఱియొక 'హోంరూలు'ను స్థాపించితివా ఏమి?

కమ : నేను స్థాపించిన దేమి? భారతగృహిణికి 'గృహపరిపాలన' జన్మహక్కే కదా !

జవ : ఓహో ! నీవు గృహపాలనవిషయమా మాట్లాడునది. ఎంతదొడ్డ ఇల్లాలివి !

కమ: మఱి మీరు మాట్లాడునది బీసెంటుగారి 'హోంరూలు లీగు' విషయమా? అదియైనను స్త్రీ స్థాపించినదే.

జవ : స్థాపించినది స్త్రీయే. కాని పురుషసహకారముగూడ లేకపోలేదు సుమా!

కమ : ఆమె సంఘమునకు 'హోంరూలు' అనియేల పేరిడెనో?

జవ : 'హోంరూలు' అన గృహపరిపాలనగదా! నీ కీ యానంద భవనమే గృహ మయిన, నామెకు భారత దేశమే గృహము. నీకు ఇందిరయే సంతాన మయిన, దేశప్రజయంతయు నామెకు సంతానమే. 'హోంరూలులీగ' న స్వపరిపాలనా సంఘ మనియే యర్థము.

కమ : అయిన నామె ఐర్లాండు దేశస్థురాలుగదా!

జవ : వారిదేశమున యీ పేరున సంఘమును స్థాపించియే స్వాతంత్ర్యమునకుఁ బోరాడిరి. దానినే యిచట అనుకరించిన దా వీరమాత.

కమ : అవును! వీరవనిత గాకున్న ఆసేతుహిమాచలపర్యంత భారతదేశము నుట్టూత లూగించగలదా? మఱి స్త్రీలు అబలలు అనుచుందురే?

జవ : స్త్రీలు అబలలా? వారు శక్తిస్వరూపలు. తలంచుకొన్న ప్రపంచమును గుప్పిట పట్టజాలుదురు. బిసెంటమ్మ గారి 'న్యూ ఇండియా' పత్రికను చదివియుంటివి గదా!

కమ : చదివితిని. ఆమె వ్యాసముల నామూలాగ్రముగ చదువుచుండు దానను. ఆ ప్రతిభ యన్యులకు లేదు. ఆమెను 1917 సంవత్సరము జూన్ మాసమున ఉదకమండలమున నిర్బంధించినప్పుడు దేశమున కలిగిన యలజడియే యామె శక్తికి నిదర్శనము.

జవ : అదియేకాదు. ఆంగ్లదేశము మొదటి ప్రపంచయుద్ధ

మధ్య శక్తి యుక్కిరిబిక్కిరి యగుచున్నను, బిసెంటుగారి తీవ్రాందోళనాఫలితమును ఆంగ్లప్రభుత్వము గమనింపవలసి వచ్చినది. మాంటేగు ఇండియాకార్యదర్శిగా నియమింపబడెను. స్వతంత్రవీరులు కారాగారవిముక్తులు గావింపబడిరి. "క్రమబద్ధమైన పరిపాలన భారతదేశానికి ఒసంగబడు"నని కొన్ని రాజ్యాంగసంస్కరణలనుగూడ నొనర్చెను.

కమ: చూచితిరా స్త్రీలప్రతిభ! మా సహకారము లేక మీరు భారతస్వాతంత్ర్యమును సాధింపగలరా?

జవ: కమలా! మీ సహకారమే కాదు. మీరే భవిష్యద్భారతావని నుద్ధరింపగల రని నా విశ్వాసము.

కమ: అదుగో! మన విజయమ్మ వచ్చుచున్నది.

విజ: (ప్రవేశించి) అన్నయ్యా! మా వదినగారికి వాఢిల్లీ మీద మక్కువ తీరినట్లు లేదు.

కమ: విజయమ్మా! తొందరపడకు; పుట్టినింటి మీఁద ప్రేమ ఎవరికైనా నుండును. జన్మభూమి మీఁద ప్రేమ, భక్తి, గౌరవము, అభిమానము లుండుట సహజమేగదా!

జవ: కాని నేఁ డట్టి సహజగుణముగూడ నంతరించినది. పారతంత్ర్యపిశాచము నెత్తిపైనెక్కి తాండవించుచుండ మాతృదేశభక్తి కూడ విస్మరింపబడినది. విజయా! నేడు మన దేశ మెట్టి దీనస్థితిలో నున్నదో గాంచుము. ఈ పరపాలనా ఫలితముగా మనదేశస్థులు జాతిని, విజ్ఞానమును, పూర్వపు టౌన్నత్యమును మఱచిరి. ఇట్టి వీరియందు జాతీయతను పునః ప్రతిష్ఠించుట యెటులో? ఇదియే నా హృదయమున నెల్లపుడు ఆవేదన గలిగించుచున్నది.

కమ: అటు లనదవేల? కాంగ్రెసుసంస్థ కలదుకద్దా!

జవ: అది మితవాదుల పాలై భిక్షాధోరణి నవలంబించినది. అతివాదులగు శ్రీ తిలక్, బిసెంటు, పట్టాభి మున్నగువారు దానినుండి వేరైరి.

విజ: అదియేమి అన్నయ్యా? క్రిందటి మాసమున నేకదా మన యింటియందు పెద్దలను సమావేశ పఱచితివి. రెండు సంఘములు కలసిన వని, కాంగ్రెసుకు 'జై' యని యుత్సవములుకూడ జేసితిరిగదా!

జవ: ఎటులో జాతీయసంఘైక్యత కలిగినదిగాని ఉత్సాహ వంత మగు కార్యక్రమము లేమిచే సంస్థ నిర్జీవప్రతిమవలె నున్నది. నేటి పారతంత్ర్యమహాసముద్రమున దురాశా ప్రేరితు లగు సామ్రాజ్యవాదులు కల్పించు తుపానులమధ్య భారతజాతీయకాంగ్రెసు నౌకను నేర్పుగా నడిపింపగల మేటినావికుఁ డెవ్వఁడో కదా!

కమ: మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ.

జవ: కమలా! చక్కనిసూచన. బీహారునందలి చాంపరాన్ జిల్లాలో కిసానుసత్యాగ్రహమును జరిపి ప్రజల బాధల మాన్పిన మేటివీరు డాతఁడే! ఇఁక జరుగబోవు కాంగ్రెసు విజయనాటకమున నాతఁడే ముఖ్యపాత్ర ధరించగలడు.

కమ: ఔను అదిగో! నిజంబని పులుగులజంట తమకోమలం బగు వెలుంగుల నామోదమును సూచించుచున్నది.

విజ: ఇఁక నేమి? మీ జంటకూడ గమ్యమును జేర యత్నింపుఁడు. పశ్చిమదేశముల చీఁకటిని బాప భాస్కరుఁ డదే పశ్చిమమున కేగెను. మనమును పోవుదము.

జవ : విజయా! ఒక్క జాతీయగీతమును బాడుము.

విజ : "జనగణ మన అధినాయక జయ హే"
భారత భాగ్యవిధాతా। పంజాబు సింధుగుజరాత
మరాటా ద్రావిడ ఉత్కళఆంధ్ర। వింధ్యహిమాచల
యమునాగంగ ఉచ్ఛలజలధితరంగ। తవ శుభనామే
జాగే తవ శుభ ఆశిషమాగే॥ గాహే తవ జయగాథా
జనగణ మంగళదాయక జయహే భారతభాగ్యవిధాతా
జయజయహే జయహే జయజయ జయ జయహే

## రంగము ౮. (1921)

ప్రదేశము : ఒక భవనము

ప్రవేశము : ప్రకాశముపంతులు

ప్రకా : ఆహా! గాంధిజీ ప్రతిభ యెంతని కీర్తింతును. అతఁడు సేవాసత్యముల అవతారమే. నిస్సంశయము.

సీ. బహునీచముగఁ జూడఁబడు దక్షిణాఫ్రికా
భారతీయుల యార్తిఁ బాపివచ్చె
యజమానులకుఁ జిక్కి యల్లాడు బీహారు
తోఁటవారల గోడు తొలఁగఁజేసె
పన్నుకై బాధింపబడుచున్న గుజరాతు
రైతులతోఁ జేరి పోరాడి గెలిచె

వేలనాలను బెంచ వేదు 'అహ్మదబాదు'
మిల్లుకూలీకోర్కెఁ జెల్లజేసి
గీ. తుదకు సత్యాగ్రహాస్త్రంబు తొడిగి మొన్న
మొన్న 'రౌలటు శాసనాల్' మూలఁద్రోసె;
భరతభూమిని ధర్మంబుఁ బాదుకొలుప
ప్రభవ మందిన చక్రి వేవలుకు లేల?

అట్టి గాంధీమహాత్ముని సహచరులై దేశసేవచేయని వారిజన్మ మేల? (గాంధిపటము చూచుచుండును.)

(వెంకయ్య, మీరాసాహెబులు ప్రవేశింతురు.)

వెంక: అయ్యా! పంతులుగారున్నారా? (పరికించి) ఇచ్చటనే యున్నారా! దండాలండి.

మీరా: సలామయ్యా!

ప్రకా: అయ్యా! రండు. కూర్చుండుఁడు.

వెంక: అయ్యా! నాదో వ్యవహార ముందండి. ఇయిగోనండి కాగితాలు.

మీరా: నా యువహారంకూడ సి త్తగించండి.

ప్రకా: (నవ్వి) మీ వ్యవహారములు బాగుగనే యున్నవి. నా వ్యవహారము నినుఁడు.

వెంక: అదేమిటండి?

ప్రకా: నే నిక కోర్టునకు పోనని ప్రతినబూనితిని. ఈ వృత్తిని విసర్జించితిని.

వెంక: ఎందువలన స్వామీ?

ప్రకా: ఈ కోర్టులవలన మనకు లాభము లేదు. ఇవి మనలను అంతఃకలహములతో కట్టివేసి బంధించుట కేర్పడిన మాయా వల్లరులు. దేశమంతయు నేడు మేల్కొనినది. బ్రిటిషు గారడీవాని మోసమునుండి మేము నేడీ మహానుభావుని దయవలన విముక్తుల మైనాము; ఈతడు.

మ. చరఖానాదమె వేణుగానముగ విశ్వప్రేమగీతాళు లు
ర్వరసర్వస్వముమారు మ్రోయునటులాలాపంబుగావించి సు
స్థిరశాంతి న్నెలకొల్పు నేడు ఘనగాంధీనామకృష్ణుండు దు
స్తర హింసాసురుని న్వధించుటకు నీ చక్రంబె చక్రంబుగా.

వెం: ఈ మహాత్ముం డెవరండీ?

ప్రకా: ఈయన గాంధీగారు. ఈయన మన భారతదేశము నందలి గుజరాత్ దేశమున 'పోరుబంద' రను గ్రామమున 1869 సంవత్సరము అక్టోబరు రెండవ తేదీన జన్మించిన పుణ్యమూర్తి.

మీరా: అయిన ఆయనగారు చెప్పున దేమి?

ప్రకా: అమ్మలారా! మీరు పిచ్చివారైతుసోదరులు. తెల్లని వన్నీ పాలు, నల్లనివన్నీ నీరు యనుకొందురు. దేశ మం దెంతమోసము,ఘోరము జరుగుచున్నదో మీ రెఱుగరు.

వెంక: ఏమి జరుగుచున్నది పంతులుగారూ?

ప్రకా: పంజాబులోని దురంతములు వర్ణింప తరము గాదు. జలియనువాలాబాగున—

సీ. గర్భిణీస్త్రీలను కనికరంబును మాని
చిత్రవధలను జేసి చీల్చినారు

పసిబిడ్డలనుగూడ పలుఠకంబులుగాను
ముక్కముక్కలుచేసి మురిసినారు
అంధవృద్ధాదుల నంగవిహీనుల
జంతుసంతతివోలె చంపినారు
లాటీలు కత్తులు నీటుగాఁ ద్రిప్పచు
గుండ్లబారులుగూడ గుప్పినారు
గీ. చుట్టుగోడలమధ్యను జుట్టవైచి
నదులవగిదిని రక్తంబు నడపినారు
అకట! డయ్యారు పంజాబుహత్య లన్ని
మరువగాలేరు మహిలోన మనుజు లెవరు.

వెంక : ఇది ఎప్పుడు జరిగినది? మిక్కిలి ఘోరముగానున్న దే.

ప్రకా : ఎప్పుడోకాదు. 1919 ఏప్రియల్ 13వ తేదీన.

మీరా : అబ్బా! ఎంతకష్టము. ఎంతమంది నశించినారోగదా!

ప్రకా : ఏమిచెప్పుదును. 1600 తుపాకీకాల్పులు జరిగినవి. హిందువులుగాని మహమ్మదీయులుగాని పిల్లలు పెద్దలు స్త్రీపురుషులు మొత్తము 800 మంది ప్రాణములు కోల్పోయిరి. 2000 మంది క్షతగాత్రులైరి.

వెంక : ఔరా! దుర్భరము. ఇది యంతయు ప్రభుత్వమువారే చేయించిరిగదా!

మీరా : అయితే మనమిక చూస్తూ ఊరకుండవలసినదేనా ?

ప్రకా: అదిగో అందులకే శ్రీగాంధిజీ ప్రయత్నించుచున్నాడు. ఆయన ఆదేశానుసారము మనమందరము నడుములుబిగించి కార్యరంగమున దుముకవలెను.

వెంక : అయ్యో! మీవలె నందఱు వృత్తులమాని వేసినారా?

ప్రకా: దేశమందంతటను వేలు లక్షలు సంపాదించు వారెల్ల రీ మహాత్ముని పిలుపును విని తమతమ వృత్తుల విసర్జించినారు. అలహాబాదున మోతీలాల్, జవాహర్‌లాలులు, అహమ్మదాబాదున వల్లభాయిపటేల్, పాట్నాలో రాజేంద్రప్రసాదు, పంజాబులో డా॥ కిచ్లూ సత్యపాలులు, ఢిల్లీలో అసఫాలీ మున్నగు వారందరీ యుద్యమమున దిగిరి. ఇక మన తెలుఁగుదేశమున ఉన్నవ లక్ష్మీనారాయణ, సాంబమూర్తి, కాళేశ్వరరావు, సీతారామశాస్త్రి మొదలగు వారెల్ల ప్లీడరీవృత్తి మానిరి. వృద్ధనాయకులగు వెంకటప్పయ్యగారు కూడ సహాయనిరాకరణమును పూనినారు.

వెంక: అయితే మన మేమి చేయాలి?

ప్రకా: మనము గవర్నమెంటు వారి కేవిధముగను సహాయము చేయరాదు. కోర్టులను బహిష్కరింపవలెను. పంచాయతీ కోర్టుల నేర్పరచుకొనవలెను. ఇంగ్లీషు చదువులకు మన పిల్లలను పంపరాదు. విదేశవస్త్రములను, వస్తువులను కొనరాదు. స్వదేశీపరిశ్రమలను పెంచుకొనవలెను. వాటికే చిహ్న మీ రాట్నంపుచక్రము.

వెంక: చాల బాగున్నది. సర్కారువారి కెట్టి సహాయమును చేయము. మీరాసాహేబు! ఇఁక మన వ్యవహారములు కట్టిపెట్టు. పంతులుఁగారు చెప్పినది వింటివికదా!

మీరా: విన్నాను. ఇంక మనము తయ్యార్ కావలసిందే!

ప్రకా: ఇదిగో మేము ప్రచారమునకు బయలుదేరుచున్నాము.

తెంపు. భరతమాతకు 'జయ్'. (పాడుచు నిష్క్రమింతురు.)

మోహన—ఆదితాళం

1. నమో హిందుమాతా సుజాతా నమో జగన్మాతా
అమోఘదివ్యమహిమాన్వితా
అఖండవర భరతఖండమాతా ॥నమో॥

2. విపులహిమాద్రులే వేణీభరముగ
గంగాయమునలే కంఠహారముగ
ఘనగోదావరి కటిసూత్రముగ
కనులకు పండువ ఘటించు మాతా ॥నమో॥

3. గోలకొండ నీ రత్నకోశ మట
కోహినూరు నీ జడలో పూ వట
టాజ్ మహాల్ నీ దివ్యభవన మట
అహాహా నీ భాగ్యము మాతా ॥నమో॥

★

రంగము ౫. (1922)

ప్రదేశము : పెదపూడి

ప్రవేశము : కాంగ్రెస్ సేవకుడు తుమ్మల బసవయ్య
(కాంగ్రెసు పతాకమును పట్టుకొని నడచుచు)

బస : జయము జయము జయము నీకు భరతమాత !
జయము దిగ్విజయమమ్మ భరతమాత !
రెండువందల యేండ్లక్రింద భరతమాత !
కుంఫిణీవాడు వచ్చాడు భరతమాత !

వృత్తు లన్ని చెఱచినాఁడు భరతమాత !
చిప్పచేతి కిచ్చినాఁడె భరతమాత !
జయ్ భరతమాతకు—జయ్ గాంధీమహాత్మకు జయ్.
(రెండువైపులనుండి జనులు వచ్చిచేరుదురు.)

బస : అయ్యలారా! కూర్చుండుఁడు! సహాయనిరాకరణోద్యమ శంఖము అదే శ్రీగాంధీమహాత్ముఁడు పూరించినాఁడు. దాని నాలించి—

సీ. ఘనతరోద్యోగముల్ గడ్డిపోచనుబోలె
దలఁచి మొదలతో కాలదన్నినారు
లక్షలాది గడించు లాయర్లు తమవృత్తి
చిల్లిగవ్వఁగ విసర్జించినారు
కానుకుంగొఱగాని కాలేజి చదువుల
విద్యార్థు లెందఱో విడచినారు
ఫలితశూన్యంబు లీ పాడుశాసనసభ
లంచు వాని బహిష్కరించినారు

గీ. విలువగల విదేశీవస్త్రములను బేర్చి
అగ్నిహోత్రున కర్పించి యలరినారు
ఇవ్విధి నసహాయోద్యమం బెల్లయెడల
దేశమందున వ్యాపించె తీవ్రముగను.

1 రైతు: అయ్యా! ఉద్యోగాలునోళ్లు ఉద్యోగాలొదిలేశారు. సరే! మే మేమి చేస్తామ్.

బస : మీరు చేయవలసినదిగూడ కలదు. ఐతే క్రొత్త విషయముకాదు. ఇదిగో రాట్నము. మీయిండ్లగూడనున్నది. కాని అటకలమీఁద బూజుపట్టియున్నది. ఇఁక దానిని

దింపండి. చరఖా నుద్ధరించండి. కదురాడిన కాటకముండ దనిన పెద్దలసుద్దులు మన్నించండి.

సీ. ఈ రాట్నమే సుమీ! యిహపరంబులరెంటి
సాధింపగాఁజాలు సాధనంబు
ఈ రాట్నమే సుమీ? ఋజుమార్గసంచార
శాంతికాముల కెల్ల సత్పథంబు
ఈ రాట్నమే సుమీ! యేకైకస్వాతంత్ర్య
దీక్షావిహారుల మోక్షదంబు
ఈ రాట్నమే సుమీ! హింసాపరుల దుర్భ
రార్భాటము లడంచు నాయుధంబు

గీ. ఇట్టి రాట్నమె సుమి! భూమి నెల్లయెడల
శాంతి సందేశముల నంపు 'తంతితీఁగె'
ఇట్టి రాట్నమె సుమి! ఘోరహింసఁబాపఁ
జాలు వ్రతమంచుఁ జాటు శాస్త్రంపు మేటి.

2 రైతు: అయితే ఈ సన్నసన్న బట్టలు, నాజూకైన బట్టలు నాశనం చేయ మన్నా వంటయ్యా.

బస: నిస్సందేహముగ! ఇప్పుడేకదా చెప్పితిని. విదేశీవస్త్రములు ముట్టమని శపథంచేయండి. స్వదేశీవ్రతమునకు కంకణము ధరించండి. రాట్నమును నెలకొల్పండి. విదేశీ వస్త్రముల కగ్గి యంటించండి.

1 రైతు: అయ్యా! తెలియకడుగుతున్నాను. మనగుడ్డ మనం తగల బెట్టుకుంటే సర్కారువాఁడి కేం నష్ట ముంటుంది.

బస: అది సరియగుప్రశ్న. అందే రహస్యమున్నది. మనగవర్న మెంటు వ్యాపారపు గవర్నమెంటు. మనదేశమునుండి

ము డిప్రత్తిని తీసికొనిపోయి వారిదేశమందలి మిల్లులలో, వారిదేశమందలి కూలీలచేతనే బట్టలు తయారుచేయించి మన కమ్ముచున్నారు. ఇదివరలో మన గ్రామములో మన పొరుగున నుండే మాల వెంకటదాసుకో, సాలె కోటిలింగమునకో వచ్చు పావలాఆదాయము పాడయిపోయినది. లక్షలాది ప్రత్తి పట్టువారు, ఏకులు వడకువారు, వృత్తులు నశించుటచే జీవనాధారము గోల్పోయినారు. ఈ విధంగా మనకన్నులముందే గారడీతంత్రముచేసి మనదేశములోని అరువదికోట్ల ధనములో వారు కోట్లు, బూట్లు, సూట్లు, హేట్లతో కులుకుచున్నారు. మనవారు కూడుగుడ్డలులేక అల్లాడుచున్నారు. కావున స్వదేశీవ్రతమును చేపట్టుడు.

మ. ధనమా కూడును, దాస్యమా యుడుగు స్వాతంత్ర్యంబ చేకూరెడిన్,
ఘనమా కల్గును, కామమా తఱుగు, సౌఖ్యంబా కడున్ వృద్ధియౌ
వినయంబా జనియించు, ధైర్యరమయా పెంపొందు నింపొందగన్
మన మాధ్యాత్మిక చింతలొందవులు రాట్నశ్రీని జేపట్టినన్.

అపుడు సర్కారుకు సహాయము జరుగకుండును.

2 రైతు: ప్రభుత్వానికి సహాయము చేయుటం మానవలెనంటే మనము శిస్తులు కట్టుట మానకూడదా?

బస: అది పెద్ద సమస్య. అందు కష్టనష్టములు మెండు. అట్టి పనికి దృఢతరదీక్షయు, త్యాగమును గావలయును.

1 రైతు: కష్ట మేముండును?

బస : పన్నుల నిరాకరణ ప్రారంభించిన ప్రభుత్వము హింసా కాండకు దిగును. మన మొక్కవమోరిమిని అలవఱుచుకొన వలెను. శాంతిమార్గము నవలంబింపవలెను.

2 రైతు : అది ఎట్లు జరుగునయ్యా !

బస : ఎట్లా ? పెదనందిపాడు, దుద్దుకూరు, పలనాడు లందు పన్నుల నిరాకరణోద్యమ మెంత విజయవంతముగా నెర వేరెనో వినలేదా ? ప్రభుత్వమువారు తుపాకి గుండ్ల జూపించినను జడియక, దౌర్జన్యము పూనక యుండిరి.

1 రైతు : ఔను; గ్రామమంతయు నొక్కకట్టుగా నున్నారట. ప్రభుతోద్యోగులను పూర్తిగా బహిష్కరించి రట.

బస : చీరాల, పేరాల పౌరులు శ్రీ ఆంధ్రరత్న గోపాల కృష్ణుని మాటపై నిలచి ప్రభుత్వవిధానము నిరసించుచు తమకు మ్యునిసిపాలిటీ వలదని గ్రామమువెలుపల ఆరు మాసములు గుడిసెలయందు నివసింపలేదా? గుజరాతు దేశము బార్డోలీ జిల్లా వాసులందఱు వల్లభాయి పటేలు నాయకత్వమున పన్నుల నిరాకరణము నొనర్చి తమ యచంచలదీక్షను చూపియుండలేదా ? కావున తగిన నాయకుని అనుమతిలేక దాని నాచరింపరాదు.

రైతు : ఓహో ! సత్యాగ్రహ మన్న నిదియా ! ఇంక మేము విదేశీవస్త్రముల ధరింపము. మా పిల్లలను ఇంగ్లీషు బడు లకు పంపము. కోర్టులెక్కము. ఖద్దరేధరిస్తాము. రాట్నాలు వడుకుతాము. ఐకమత్యాన్ని సాధిస్తాము.

బస : జయ్! మహాత్మగాంధికీ జయ్! లేవండి పోదాము.

(తెరపడును.)

# కాంగ్రెసు విజయము

## 2. సంపూర్ణ స్వరాజ్యాంకము
( 1930—40 )

రంగము ౧ — (26-1-1930)

ప్రదేశము : జండా స్తంభమువద్ద

ప్రవేశము : జవాహర్, కొందఱు జనులు, వాలంటీర్లు.

వాలంటీర్లు : కీర్తన—

మూడురంగుల జండ । ముచ్చటైనా జండ
భారత స్వాతంత్ర్య । ప్రతిబింబ మీ జండ
ఆకాశవీథిలో నెగురవేయండి
ఔన్నత్యమును జాతి కందజేయండి ॥మూ॥
జాతి, మత, కుల, వర్గ సామరస్యముగూర్చి
భారతైక్యతగూర్చి వలుగుచుండెడి జండ
ఆకాశవీథిలో నాడనీయండి
స్వాతంత్ర్యపథమున సాగి నడవండి ॥మూ॥

జవ : (పతాక వందనము గావించి, పతాకమును పైకెత్తి) ఈ పతాకము మన జాతికి ముఖ్యచిహ్నము. దీని నిచ్చట ప్రతిష్ఠించినాము. దీనిని ప్రాణప్రదముగా కాపాడుకొన

వలెను. తల్లి తన యొడిలోని పసిబిడ్డను రక్షించిన రీతి మనలో ప్రాణవాయువు లున్నంతవఱకు దీనిని రక్షించవలెను. జాతీయ పతాకమున కగౌరవము రానీయరాదు.

జెండాపాట (హిందీకాఫీ—దేశాది)

విజయీ విశ్వతి రంగా ప్యారా
ఝుండా ఊంచా రహే హమారా ॥వి॥

సదా శక్తి బరసానేవాలా
ప్రేమసుధా సరసానేవాలా
వీరోంకో హరషానేవాలా
మాతృభూమి కా తనమనసారా ॥వి॥

స్వతంత్రతాకే భీషణరణమే
లఖకర బఢేజోష్ క్షణక్షణమే
కాంపే శత్రు దేఖకర మనమే
మిటజావె భయసంకట సారా ॥వి॥

ఇసఝుండేకే నీచే నిర్భయలే
స్వరాజ్య అవిచల నిశ్చయ
బోలో భారతమాతాకీ జయ
స్వతంత్రతాహో ధ్యేయహమారా ॥వి॥

ఇసకీశాసన జానేపాయె
చాహే జాన భలేహీ జాయె
విశ్వవిజయకరకే దిఖలాయె
తబ్ హోవే ప్రణ పూర్ణ హమారే ॥వి॥

ఈ 1930 జనవరి 26 మనకు శుభదినము. ఇకమీదట ప్రతి వత్సర మీ జనవరి 26 మనకు స్వాతంత్ర్యదిన మను పండుగ యగును గాక! ఈ రోజే దేశమందంతటను లాహారు కాంగ్రెసులో తీర్మానించిన విధమున సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధికి కంకణములు ధరించవలసిన మహాపర్వము. ఇదియే ప్రమాణ పత్రము. దీనియందలి ప్రమాణమును త్రికరణ శుద్ధిగా స్వీకరింపుడు. "ధర్మసమ్మతమైన శాంతిపద్ధతులపై భారతదేశమునకు పరరాజ్యసంబంధము లేని సంపూర్ణస్వరాజ్య సంపాదనార్థమై కాంగ్రెసునుండి పంపబడు నుత్తరువులను శిరసావహించుటకు మే మిందుమూలముగా ప్రమాణము చేయుచున్నాము" (ఒక్కొక్కమాట అనుచు, అనిపించును) ధైర్యమును బూనుడు. అటుచూడుడు.

మ. అదిగో భారతమాత దాస్యసహితయై విన్ననౌ మోముతో
గదలన్ నేరక చింతలన్ మునిగి పెన్కన్నీటి ధారావళుల్
పాదలన్ రోయుచుఁ జూచుచున్నయది దుర్వ్యాళంబులన్ శత్రులన్
వదలన్ జేయుచుసత్వరంబుగనుసుస్వాతంత్ర్యమున్ గూర్పుడీ!

ఇంక సంశయములకు తావు లేదు. అదిగో భారతదేశ దాస్యశృంఖలావిచ్ఛేదనార్థమై శ్రీ గాంధీమహాత్ముని నాయకత్వమున శాంతి సంగ్రామము జరుగబోవుచున్నది. మీ సర్వస్వమును త్యజించి ఆ మహారణరంగమున దుముకుటకు సంసిద్ధులై యుండుడు.

జయ్ భరతమాతకు జయ్.

బోలో స్వతంత్ర భారత్ కీ జయ్. (తెర పడును)

## రంగము ౨. (16-2-1930)

ప్రదేశము : సబర్మతీయాశ్రమము.

ప్రవేశము : గాంధి, జవాహర్, అజాద్, పట్టాభి, పటేల్, రాజేంద్రబాబు.

జవ: మహాత్మాజీ! మన లేఖను వైస్రాయివద్దకు గొనిపోయిన రెజినాల్డు రెయినాల్డ్సుగారింకను తిరిగి రాలేదు.

పటే: జవహార్! ఆ వైస్రాయి మన కోర్కెనేల మన్నించును. అతఁడు కరుడుగట్టిన సామ్రాజ్యవాది. ఎవ్వఁడైనను తా ననుభవించుదానిని బలవత్తరమగు కారణమున గాక విడచునా?

అజాద్ : నిజము నిజము. ఇఁక మనము కార్యాచరణకు గడంగ వలసిన సమయ మాసన్నమైనది.

రాజేం: కార్యాచరణమునకు 1928 లోని కలకత్తా సభావేదిక మందే కడంగితిమి. అనాఁడేగదా పూజ్య శ్రీ మోతీలాలుగారి యాధ్వర్యమున మనము స్వరాజ్యమును సంవత్సరములోగా గుర్తింపనిచో ప్రత్యక్ష పోరాటమునకు దిగుదుమని ప్రభుత్వమును హెచ్చరించినది.

పట్టా: అది మన శాంతియుద్ధమునకు నాందిమాత్రమే. మొన్నటి లాహోరు కాంగ్రెసు కార్యక్రమమే ప్రస్తావన.

గాంధి: అవును. ఇదివరకు వేచినంత కాల మిఁక వేచియుండ నవసరము లేదు.

పటే: అవును. మనశక్తిని మనము చూపింపవలెను.

పట్టా: ఆత్మశక్తిప్రభావమును ప్రపంచమున వెల్లడింప దగు

నమయ మాసన్న మైనది. అందుచే నై తికబలము చేకూరి భారతభూమికి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, స్వాతంత్ర్యము సంప్రాప్తింపఁగలదు.

గాంధి : అవును. నై తికవిజయమును తప్పక పొందుదుము.

జవ : బాపుజీ! మీ యహింసా సిద్ధాంతమును మేము దేశ మందు ప్రజ్వలింపచేయుదుము. మీ శాంతిమార్గమున మీ యడుగుజాడల వర్తింతుము.

గాంధి : సరియే! మనకిఁక సమిష్టిశాసనోల్లంఘనమే కర్తవ్యము.

అజాద్ : సమిష్టి శాసనోల్లంఘనమా? ముందు మనము దేశ మందులకు సంసిద్ధముగా నున్నదియు లేనిదియు కనుగొన వలెను.

రాజేం : అవును. క్రమశిక్షితులైన వారి నేరి వ్యక్తి శాసనో ల్లంఘన మాచరించుట మేలని నా యభిమతము.

గాంధి : దేశ మిపుడు సిద్ధము గాకుండిన మఱియొక వత్సరమున కైనను సిద్ధము కాఁగలదా?

పట్టా : ఇట్టి వాయిదాపద్ధతులపై దేశము సిద్ధము గానేరదు. ఈదుటకు సంసిద్ధుఁ డగుట యన్న ఈత ప్రారంభించుటయే ప్రథమ కర్తవ్యము.

జవ: చక్కఁగా వచించితిరి. నేఁటివలె ప్రజానీకె మింత యొక్కటి కిని సంసిద్ధత చూపబోవదు. మహాత్మాజీ ! మీ సహచరుల ధైర్యస్థైర్యము లీ వెఱుంగవా ?

సీ. పశ్చిమోత్తర రాష్ట్రీయార నిరసనాయకు

అబ్దుల్ గఫ్ఫారు నీ యడుగు నుండె

బంగాళమెల్ల నీ పాదాలకడ నిడ
బోసువీరుండు నీ పొంత నుండె
బీహారమెల్ల నిర్భీతి నీ కర్పింప
రాజేంద్రబాబు నీ ప్రక్క నుండె
గుజరాతు నొక్కచో గూర్చి నీ దెస నుంచ
ఘనుడు పటేలు నీ కడను యుండె
గీ. ఆంధ్రనేత కొండాజి నిన్ననుసరించె
స్త్రీలనడుప సరోజినీదేవి యుండె;
సంశయింపంగ నేల నో సత్యరూప !
సమర మారంభమునుజేయ సమయ మిదియ !

గాంధి: (జవాహార్ పై చేయివైచి) నాయనా ! నీవు మాత్రము సామాన్యుడవా ? మీయందఱిశక్తి నే నెఱుంగక పోలేదు. ఒక్కొక్క డొక్కొకరాష్ట్రమున కధినాధులు కాదగినవారు! సరియే. ఇప్పుడు మన మేశాసనమును ధిక్కరింతము?

పటేల్: మహాత్మా ! ఇంక నాలసింప నేల ?

శా. ఢిల్లీకోట నహింసనస్త్రమున నేడేపోయి బంధింతమా ?
కల్లోలం బగు క్రూరశాసనము ధిక్కారంబు గావింతమా ?
చెల్లంబో దిక భూమిపన్నని యిదే చీటీని బంపింతమా ?
యుల్లంబందలి మాటదెల్పు మిక మాకో బాపుజీ! ధీవరా !

గాంధి: సర్దార్ ! నీ ప్రతిభ నే నెఱుంగుదును. మీమీ సూచనలను గావింపుడు. నా సూచన ఇది.

గీ. ఏ కఠినశాసనము బీదలెల్లరకును
గంజినీళ్లలోనికి నుప్పుకల్లునకును

గూడ స్వాతంత్ర్యము హరించె; నేడు నట్టి
ఉప్పుచట్టమె ధిక్కారయోగ్య మయ్యె !

అజాద్: అవును. ఉప్పుశాసనమును రద్దుచేయుటకు మన మెన్నియో తీర్మానములను ప్రభుత్వమున కంపియుండ లేదా ?

రాజేం: అవును. దాని కిప్పుడు మంచియవకాశము చిక్కినది.

జవ: అది ప్రజాసామాన్యమునకు ముఖ్యావసరము. కాన ప్రజల యందు చైతన్యోత్సాహములు కలిగింప మనకు మంచి యదను దొరకినది.

పట్టాభి: మానవావసరముల విషయమున గూడ ప్రభుత్వ నీతియు, వా రవలంబించు కాఠిన్యమును లోకవిదితము కాగలదు.

జవ: బాపుజీ ! కాలహరణ మేల ? ఈ యహింసా సంగ్రామమును నడుప తామే సర్వసేనాధిపతులు. మేము మీ యనుచరులము.

గాంధి: మీ మనోగతాభిప్రాయము లెఱింగితిని. నా మానసిక శక్తియు ఇనుమడించినది. నే నిదివఱకే కార్యక్రమమును నిర్ణయించుకొంటిని. నేను 12-3-1930 తేదీన యాశ్రమవాసుల డెబ్బదిమందిని గూర్చుకొని దండయాత్రకు బయలు దేరుదును.

సీ. దండిచేరంగనీక దారినే న న్నాపి
పరిపాలకులు చుట్టి పట్టగలరు
పట్టక న్వదిచిన నెట్టన నటచేరి
కడలిసీటను నుప్పుకల్లు సేతు

అంతట నే నిత్తు నాజ్ఞ మీ రెల్లరు
నుప్పు చేయుటకునై యొప్పుగాను
నాటినుండియు మీరు నాల్గువైపులయందు
ఈ శాసనము ధిక్కరింపవలయు.
శాంతిమార్గంబు విడువక సర్వవిధుల
నోర్పు జూపంగవలె ప్రజల్ నేర్పుమీఱ
నేను బంధింపఁబడినచో వేనవేలు
నాయకులు లేవవలెనయ్య నాల్గుకడల

జవ: చిత్తము. ఇఁక మన ప్రయత్నమున నుందము.

(నిష్క్రమింతురు)

★

## రంగము 3 — (1930)

ప్రదేశము: ఢిల్లీ.

ప్రవేశము: ఇర్విన్, హోంమెంబరు, కమాండర్ ఇన్-చీఫ్.

ఇర్విన్: చూచితిరా? గాంధిగారి లేఖ. పూర్తి స్వాతంత్ర్యమే కాంగ్రెసు లక్ష్యమఁట. అంతకుతక్కువ అంగీకారము కాదఁట.

హోం: మన మీ విషయమును పార్లమెంటుతో ఆలోచించు కొనియే యున్నాముగదా! వారి యాజ్ఞల ననుసరింతము.

కమాం: ఇట్టి బెదరింపుల కేమిలెండు. ఎన్ని బాబులువచ్చినవి; ఎన్ని రా మున్నవి.

ఇర్విన్: ఇది అట్టిది కాదు. కాంగ్రెసువారు శాసనతిరస్కారోద్యమము ప్రారంభించు రఁట.

కమాలం: ఈ యుద్యమముల కేమిలెండు. నేటి బ్రిటిష్ ప్రభుత్వ బలమును గాంచి రెటుంగరు కాబోలు. రవి యస్తమింపని మన సామ్రాజ్య బలము వారి కేమి తెలియును. ఇంచుక ఆజ్ఞ నిండు; దానిని చూపెదను.

ఇర్విన్: మన కట్టి బలము కలదు. నిజమే. కాని గాంధి కొంచెక రాని కొయ్య. ఆయన వెనుక నలుబదికోట్ల ప్రజానీకము కలదు.

హ్యూం: భారతప్రజ యంతయు వాని నాయకత్వము నంగీక రించు నని నమ్మకుడు. మన చేతిలో రాచకీయపుతంత్రము గలదు. పదవీవ్యామోహము ఎఱగా జూపి హిందువులను, మహమ్మదీయులను చీలదీయగలము. మరల హిందువులలో నిమ్నజాతులను వేఱు చేయగలము. నిజముగా ఈ దేశము లోని జాతి, మత, కుల, వర్ణ, వర్గ, కలహములు మన సామ్రా జ్యము సుస్థిరముగా నిల్పుటకు పునాదులు.

ఇర్విన్: చీలదీసి పాలించుట మన రాజనీతియే యగును. కాని గాంధీగారి యుద్యమమునకు సంఖ్యాబలముకన్న నైతిక బల మధికము.. వారు శాంతిని బూని యితరులను బాధిం పరు. వారిపని వారు చేయుదురు. విరోధము పూనరు; దుష్టచేష్ట లొనరింపరు. అట్టివారి నెమర్కొనుట యెట్లు? అట్టివారిపై హింసాచర్య లొనర్చిన సభ్యప్రపంచము, మనను మన సామ్రాజ్యనీతిని దూయబట్టదా?

కమాలం: మనము వారిని దౌర్జన్యచర్య లొనర్ప కవ్వించు దాము. అప్పుడైనను వారు దౌర్జన్యపూరితులు కాకపోరు.

ఇర్విన్: సరియే. పరిస్థితుల గమనించుచుందము. ఇదిగో నే

నీక ఆర్డినెన్సులను చేయ నుద్యమింతును. మీరు మీ మీ పనులయందు జాగ్రతగా నుండుడు. దేశ మందంతట నుద్యోగులకు తాకీదులనుపంపుడు. కట్టుదిట్టముల జేయుఁడు. ఇఁక మన పనులకై మనమేగుదము. రెండు.

(నిష్క్రమింతురు)

★

రంగము ౪ — (1930 ఏప్రియల్)

ప్రదేశము : ఆనందభవనము.

ప్రవేశము : జవహర్, కమల, విజయలక్ష్మి.

జవ : కమలా! నేఁడు దేశమునందు,

గీ. ఉప్పు మని నాల్గుదెసల రగుల్కొనియె ప్ర
చండ శాసనధిక్కార సమరవహ్ని
ప్రజ్వలింపగ జేయఁగావలెను దాని
నింధనంబుల నారిపోనీయనీక.

ఇదిదె - ప్రజావిప్లవము చెలరేగినది.

కమ : అవును. అదే పూజ్యబాపూజీ దండయాత్రను దిగ్విజయముగ నాగించెను. తీరమునందు ఉప్పు తయారుచేసి ప్రభుత్వము నందలి యొకానొక యవినీతికర శాసనమును మనఃపూర్తిగను, బహిరంగముగను ధిక్కరించి నేటి నాగరికతా ప్రపంచమున నొక మహత్తరసత్యమును ప్రకటించెను.

విజయ : ప్రపంచచరిత్రలో నిదియొక యపూర్వసంఘటన. ఒకానొక బక్కచిక్కిన బోసినోటి ముసలయ్య సూర్య

డ స్తమింపని సామ్రాజ్యముతో డీకొనెను. అరువదేండ్ల యా ముసలి రెండువందల మైళ్ళు కాలినడకను తానే శాంతిసైనికుల కగ్రగామియై నడచుచున్న దృశ్య మెట్లు న్నదో గదా! కనులార చూడ నోచ మైతిమి.

కమ : వారి నితరులకు నిర్బంధింపక పోవుట విచిత్రము.

జవ : అదే శాంతిరణమునకు భేరీ మ్రోగించెను. దేశమంతట ఉప్పు తయారు చేయవలె నని యాజ్ఞ నొసంగెను.

విజ : ఇంక నేమి, నీవును ఆరంభించితివిగదా. ఉదయముననే తయారుచేసిన ఉప్పుపొట్లముల బహిరంగముగ విక్రయించి శాసనమును ధిక్కరించితివిగద!

జవ : సరి. అది యెంతపని. జరుపవలసిన కార్యమంతయు ముందేకలదు ప్రజలను మేలుకొల్పి, వలంటీరులను సమ కూర్చుకొని ఉప్పుకొఠారులపై దాడి వెడలవలెను.

కమ : నేను కూడ మీ వెంటవచ్చెదను. నరకాసురసంహారమున కృష్ణునకు సత్య తోడ్పడ లేదా?

జవ : కమలా! మన వివాహకాలమున గాంధిజీ చెప్పనే చెప్పెను. మంగళసూత్రము ముళ్లకంచె యగునేమో యనెను. నిజముగ వివాహమైనదాది నా సాహచర్యమున మాతృభూమికయి కష్టములనే అనుభవించుచుంటివి.

కమల: నాయందలి వాత్సల్యమున నట్లందు రేగాని, దేశమాత పాదారవిందముల సన్నిధి నొందఱు స్త్రీలు తమ జీవితము లర్పింపలేదు? ఆంధ్రదేశమున మాగంటి యన్నపూర్ణాదేవి దేశసేవయందే నిమగ్నురాలయి తుదకు ప్రాణములువిడచు నప్పుడు "నన్ను మఱచినను దేశమును మఱువవల" దని

తన భర్తకు చెప్పి యసువులు వీడలేదా? బాపూజీతో పాటు కస్తూరిబా మాతయు దేశసేవయందే తన జీవితమును గడవుచుండలేదా?

విజయ: అన్నయ్యా! నేను మాత్ర మన్నకదగిన ఆడబడుచును గావలదా? ఆ సరోజినీదేవివలె నేను కూడ దేశసేవ చేసి మనవంశమునకు కీర్తి తేవలదా?

జవ: అమ్మా! కొంచెము శాంతింపుడు. మన నేతాజీనుండి స్త్రీల కింకను పిలుపురాలేదు. వచ్చినవెంటనే మీరును రావచ్చును.

వలం: (ప్రవేశించి) అయ్యా! మనయింటికి పోలీసుఇన్ స్పెక్టరు వచ్చినాడు.

జవ: లోనికి పిలుచుకొనిరమ్ము.

వలం: చిత్తము. (నిష్క్రమించి ఇన్ స్పెక్టరుతో ప్రవేశించును)

విజయ: అన్నయ్యా! నీకు శ్రీముఖము వచ్చినదికాబోలు.

ఇన్: జవాహర్ లాల్జీ! వందనములు. ఇదియే తమపై వారంటు.

జవ: (వారంటు నందుకొని నవ్వుచు) మరల శ్రీకృష్ణజన్మ స్థానమున కాహ్వానము. సంతోషము. ఇది యైదవ సారి. అయ్యా! సిద్ధముగా నున్నాను. కైకొనిపొండు. కమలా! విజయా! (నడచుచుండును.)

కమ-విజ: (ముందుకు సాగుచు) మాకేమి సెలవు.

జవ: గాంధిజీ యాజ్ఞలకు వేచియుండుడు. తల్లిదండ్రులకు చెప్పుడు——

ఉ. నేడిది క్రొత్తగాదు, జననీజనకుల్ నయనాల బాష్పము
ల్వీడగబోరు, నాపయిని ప్రేముడిజూపుట గాంధిగారు పో

రాదెదు నిట్టి దివ్యరణరంగము నందున దూకుచేసుడీ!
వేఁడెద, పేరునిల్పుడు నవీనయుగాన ముదంబు చేకురన్.
'బోలో స్వతంత్రభారత్ కీ జయ్' (తెరపడును.)

★

రంగము 9 (1931-3-5)

ప్రదేశము : న్యూఢిల్లీ. ప్రవేశము : గాంధి, ఇర్విన్.

ఇర్విన్ : గాంధిజీ! మీ ప్రతిభ నా కాశ్చర్యమును గలిగించినది. మీరు మహాత్ములు. విజయులు.

గాంధి : మీరు సహృదయులు. మీ పరిచయము సంతోష ప్రదము.

ఇర్విన్ : ఈ నాల్గుదినముల సంభాషణలవలన మన సమస్యలు పరిష్కరింపఁబడినవి. ఇఁక నుండి సముద్రప్రాంతములందలి వా రెల్లరు వారి వారి కుటుంబములకు సరిపోవు ఉప్పును తయారు చేసికొను హక్కు కలిగియుందురు. వారు చిన్న చిన్నమూటలతో తీసికొనిపోయి అమ్ముకొను హక్కును కూడ గలిగియుందురు.

గాంధీ : సంతసము. కాని కారాగృహముల నున్న రాజకీయ బందీలు?

ఇర్విన్ : వెంటనే జైలునుండి విడుదలచేయబడుదురు. తమరు మాత్రము——

గాంధి : వర్కింగుకమిటీ కూడినవెంటనే శాసనోల్లంఘనము నుపసంహరింపజూతును. తక్కిన రెండువిషయములు ?

ఇర్విన్ : భగవత్సింగ్, రాజగురు, సుఖదేవుల మరణశిక్ష తప్పించుటకు యత్నింతును.

గాంధి : బార్డోలివిషయము?

ఇర్విన్ : ప్రభుత్వవశమున నున్న ఆస్తులన్నియు తిరిగి యివ్వబడును. పదవులు వీడిన డిప్యూటీకలెక్టరు లిరువురి విషయమునను శ్రద్ధతీసికొందును. శిస్తులు వసూలుచేయుటయందు మాకు సాయ మొనర్పవలెను.

గాంధి : పూర్ణస్వరాజ్యాశయము నందలి మా భావముల గుర్తించితి రని తలంతును.

ఇర్విన్ : ఈ గాంధి - ఇర్విన్ ఒడంబడిక పూర్తియైనది. సంతకము చేయుదము. మీ యహింసావిధానము జయించినది.

(తెర పడును)

★

## రంగము ౬ (1931)

ప్రదేశము: ఖాజీపాలెము.

ప్రవేశము: రాఘవమ్మ, కృష్ణమ్మ; (గవ్వలాడుచు)
(లక్ష్మిబాయమ్మ, భారతీ వంగా ప్రవేశింతురు.)

లక్ష్మి : ఏమమ్మా! ఇంకను గవ్వలాడుకొనుచున్నారా? దేశమునే ట్లున్నదో గమనించుచున్నారా?

కృష్ణ: ఎవరమ్మా ? మా ఆటచెడగొట్టుటకు వచ్చారు?

భార: అమ్మా ! మేము దేశసేవికలము: కొంచెము మీయాట నాపి మా మాట వినుడు.

రాఘు: కృష్ణా! ఉండవే! ఈ ఆటకేమి? అమ్మా! కూర్చొనుడు.
(అందరు నిశ్శబ్దిమింతురు)

లక్ష్మి: నేటి మన దేశస్థితిని గమనింపరా తల్లులారా!

కృష్ణ: ఏమి దేశమమ్మా! దేశము దేశ మంటావు.

భార: ఏమి దేశమా? బంగారుపండు దేశము, రత్నాలుదొరుకు దేశము, అనాదినాగరికతగల దేశము. నేడు స్వాతంత్ర్యము గోలుపోయి, పరరాజులకు పాదాక్రాంత మయిన దేశము-భారతదేశము తల్లీ!

రాఘు: అమ్మా! స్వాతంత్ర్యమంటివి. అది యేమి?

లక్ష్మి: స్వాతంత్ర్యమన్న నెఱుగరా? స్వతంత్ర మన్న స్వేచ్ఛ. మనపెత్తనము మనకు వచ్చుట. ఇప్పుడు బ్రిటిషువారు మన ప్రభువులు. వారు మనకు ఆరువేల మైళ్ళదూరమున నున్నారు. వారి యధికారము తొలగి మన దేశస్థులకే యధికారము రావలెను. దానినే స్వరాజ్యము, స్వాతంత్ర్యము అందురు. దానిని మనము సంపాదింపవలె నమ్మా!

కృష్ణ: అది మన యాడువారివలన నేమియగు నమ్మా?

భార: అట్లనకుము ఈ స్వాతంత్ర్యము కొఱకే రాణీఝాన్సీ లక్ష్మిబాయి తనరక్తమును ప్రవహింపచేసినది. జలియన్ వాలాబాగు వీరవనితలు తమ యస్థిమాంసముల సమర్పించినారు. ఖార్డోలీ రైతాంగన లష్టకష్టములకు లోనై సర్వమును త్యాగముచేసి ప్రాణముల బలి యొసంగినారు.

రాఘు: అటులనా? చాలబాగున్నది. కృష్ణా! దేశసేవకై మనము పోవుదము రమ్ము.

లక్ష్మి: మంచిది మావెంటరండు. ఈ జండాలను తీసికొనుడు.

**జయ్ మహాత్మాగాంధీ జయ్. భారతమాతకు జయ్.**

## రంగము ౭ (1931)

ప్రదేశము: ఉద్యోగస్థుని ఆఫీసు. ప్రవేశము; ఉద్యోగస్థుఁడు.

ఉద్యో: (బల్లమీఁద కాగితము లుంచి వ్రాయుచుండును)

(భారతీరంగా, లక్ష్మిబాయమ్మ పాడుచు ప్రవేశింతురు)

కీర్తన

వీరగంధము తెచ్చుచుంటిమి వీరు డెవ్వడో చూపుడి
పూసిపోదుము, పూజసేతుము పూలమాలల భక్తితో ॥వీర॥
బాసజేసిన భారతీయుడు పారిపోవం డెన్నడూ
మాట నిల్పెడి మనుజు డెప్పుడు మాననీయుం డౌనుగా ॥వీర॥

భార: తంత్రీ! నమస్తే! ఎన్నాళ్లీ దాస్యవృత్తి! అదుగో మన భారతస్వాతంత్ర్యసూర్యోదయ మగుచున్నది. మేల్కొనుఁడు. భరతమాత దాస్యశృంఖలముల ద్రెంప రండు. ఈ యుద్యోగములు శాశ్వతములు గావు. మీరు సంపాదించు ధనము ధన మేగాదు. త్యాగధనము నార్జింపుడు.

ఉద్యో: అమ్మా! మీ రేమి త్యాగధనము నార్జించితిరి.

లక్ష్మి: అయ్యా! ఆమెభర్త ఆచార్య రంగా. చెన్నపురి ప్రభుత్వకళాశాలలో ఆచార్య పీఠమును త్యజించి నెలకు అయిదువందలవేతనమును తృణప్రాయముగా విడిచిపెట్టెను.

ఉద్యో: "నీభార్యను నేను ప్రేమించిన ఆక్షేపణయా" యని రంగాను గాంధి యడిగినది ఈమె రైతుసేవను గుఱించియేనా ?

లక్ష్మి : అవును.

భార: ఈమెభర్త లక్ష్మినారాయణగారు, నెలకు వేలు గడన చేయు తన బారిస్టరుపట్టాను విసర్జించి దేశసేవయందు ప్రవేశించెను.

ఉద్యో: మీభర్తల త్యాగమునకు మీరంగీకరించినారు కావున మీరును త్యాగవతులే! ఇదే నా యుద్యోగమును వదలు చున్నాను. (వ్రాయుచుండును)

లక్ష్మి: జయ్ భరత్ మాతకీ జయ్. (తెరపడును)

## రంగము ౮ (1931)

ప్రదేశము ; తెనాలినడిబజారు.

ప్రవేశము; భారతీరంగా, లక్ష్మిబాయమ్మ

భార: అక్కా! అదుగో ఎవరో వస్త్రములు కొనుటకు రాబోలు వచ్చుచున్నారు.

మనుష్యుడు: (ప్రవేశించి దుకాణములోనికి పోబోవును)

లక్ష్మి: అయ్యా! తమకేమికావలయును?

మను; బట్టలు కావలయును. ఏమి? లేవా?

భార: తండ్రీ! ఇది విదేశీవస్త్రముల షాపు.

మను: అయిననేమి? నాకు కావలసినవి కొందును.

లక్ష్మి: తండ్రీ! ఒక్కప్రార్థన. మీరీ బట్టలుమాత్రము కొన వద్దు.

మను: అయిన ఏవి కొనుమందురు?

లక్ష్మి: ఖద్దరుకొనండి.

మను: ఏమమ్మా, ఆ మొద్దుగుడ్డలను కొనమందువా? పైన అవి చాలప్రియము. నేను కొనలేను.

భార : నాయనా! మీకు తెలియని దేమున్నది. స్వరాజ్య సిద్ధికి ఖద్దరే ముఖ్యసాధనమని గాంధిగారు చెప్పుచుండ లేదా? వెనుక గ్లాస్గోమల్లులు కట్టువారందఱు నేడు ముతుక బట్టలు కట్టుచుండుట కాంచుటలేదా? మన బీద వారికి తిండివద్దా?

లక్ష్మి: అయ్యా! మమ్ములను చూడుడు. ఎట్టి వస్త్రములు కట్టికొంటిమో! దేశసౌభాగ్యమునకు ప్రాణము లర్పించు వారర్పించుచుండ మీరింతటి సహాయము చేయలేరా? 60కోట్లు విదేశములకు పోవుచున్నవే? ఆపరా? మీమనస్సు కరుగదా? మా మాట వినరా?

మను : అమ్మా! మీ మాటలు విన్నాను. పాపము మీ రిండ్లు వాకిండ్లు వదలి దేశసేవకై యింత శ్రమపడుచుండ మేము ఖద్దరైనను కట్టమా? ఇఁక విదేశీ వస్త్రముల కొనను. ఇప్పుడే ఖద్దరును కొని కట్టుకొందును.

(నిష్క్రమించును)

లక్ష్మి: భారతీ! నేటికి ప్రొద్దుక్రుంకినది. రేపుదయమున కల్లు దుకాణములు పికెటుచేయ బోవుదము. పద.

(నిష్క్రమింతురు.)

★

## రంగము ౯ (1931)

ప్రదేశము : హరిజనవాడలో కల్లుదుకాణము.

ప్రవేశము : వెంకడు, వీరడు.

వెంక: ఓరేయ్ ఈరా! ఇల్లిదిగోరా దుకానము. రారా.

వీర: పదరా పోదాము. రెండుముంత లేసుకొందాము. ఈ యాల మన పిన్నదొరోరు పావలా ఇచ్చాడ్రా! దీంతో సెరిరెండు ముంత లేసుకుందాము!

(తెరలో) గాంధీమహాత్మకు జై.

వెంక: అదేంటబ్బా! కేక వేత్తుండారు. ఏరొస్తున్నార్రా!

వీర: ఏరో ఇద్దరమ్మోర్లు వత్తున్నార్రా. ఆరి కిక్కడేం పనుం డబ్బా?

(ప్రవేశము. లక్ష్మీబాయమ్మ, శాంతిరంగా నాయుడు ప్రవేశింతురు)

* దేశమును ప్రేమించుమన్నా మంచి అన్నది పెంచుమన్నా
పట్టిమాటల్ కట్టిపెట్టోయ్ గట్టిమేల్ తలపెట్టవోయ్ ॥దే॥
దేశాభిమానం నాకు కద్దని ఒట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ఒకమేల్ కూర్చి జనులకు చూపవోయ్
సొంతలాభం కొంత మానుకు పొరుగువానికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్ దేశమంటె మనుషులోయ్ ॥దే॥
చెట్టపట్టాల్ పట్టుకొని దేశస్థులంతా నడవవలెనోయ్
అన్నదమ్ములవలెను జాతులు మతములన్నీ మెలగవలెనోయ్

లక్ష్మి: నాయనలారా! ఇదేమిపని.

వెంక: అరేయ్! బాబు మొగ్గాగున్నది ఈసంటోకేరా అబ్బా.

లక్ష్మి: పరవా లేదు. దగ్గరిగా నుండవచ్చును. గాంధిగారి కృషి ఫలితముగా అంటరానితన మడుగంటుచున్నది. మీరును తోడిమానవులే. మీవద్దకు వచ్చి మిమ్ములను మంచిస్థితికి తెచ్చుటకే వచ్చితిమి.

---

* గురజాడ.

భార: మీరు త్రాగుడు మానండి. మత్తెక్కునట్లు త్రాగి యిల్లు, ఒడలు నేల గుల్లచేసికొందురు? మీ పావలాకూలి డబ్బులతో పండ్లు, పప్పు, మిఠాయిలను కొని సుఖముగా మీరు, మీ పిల్లలు, మీ భార్యలు తినండి.

వీర: ఒకేయ్! ఇదేంటశా! ఈరు మనకడ్డమొచ్చారు.

వెంక: ఉండశా! నే కనుక్కుంటాను. మీరుసెప్పేదేంటి?

లక్ష్మి: అయ్యా! నీ వీ రోజున ఎంత సంపాదించితివి.

వీర: అది ఈరకెందుకశా!

వెంక: ఓరే సివ్వుడా! అమ్మా! పావలా!

లక్ష్మి: ఎంతకు త్రాగుదువు?

వెంక: పావలాకు తాగేత్తామ్.

లక్ష్మి; పిల్లలెందఱు?

వెంక; నాకు ముగ్గురు. ఈడిక్కి నల్గురు.

లక్ష్మి: మీపావలా డబ్బులు ఖర్చుపెట్టుకుంటే మీకు, మీ పిలలకు కూడేల దొరకను.

వెంక: సిన్నాళ్లడక్కొస్తారు. పెద్దోళ్లు కూలిచేసి తెత్తారు.

భార: మీ కూలీడబ్బుతోడ కలుపుకొనిన మీరు సుఖముగా మీ పిల్లలతో తినవచ్చునుగదా! ఎందుకు మీకింతపిచ్చి. ఇకనుండి త్రాగకుము. ఇంటికి బొండు.

వీర: నిజమేనశా! ఈ పావలా పెట్టి ఉప్పు పప్పు కొనుక్కుపోతే బాగా తినొచ్చురా! కల్లొపద్దూ గిల్లువద్దు. పోదాంపదశా!

వెంక: దండాలండీ! దండాలు. సెలవిప్పించండి.

భార: ఇక మీరు త్రాగవద్దు. ఇతరులను త్రాగనీయవలదు. సుఖముగా నుండుడు, పోదము రండు. (నిష్క్రమింతురు)

## ౧౯౩౧ ము ౧౦ (1931)

ప్రదేశము : కల్లుదుకాణము.

ప్రవేశము : లక్ష్మీబాయమ్మ, భారతీరంగా

లక్ష్మి: అదుగో పోలీసు లిచట వచ్చుచున్నారు.

భార: మనకోఆకేయగునా?

పోలీ: (ప్రవేశించి) ఎవరమ్మా! మీ కిక్కడేమిపని.

లక్ష్మి: దేశ సేవ!

పోలీ: మీ చేతిలో ఆ జండా యుండరాదు; ఇచ్చివేయుడు.

భార: ఇది మా ప్రాణముకంటె విలువ యయినది.

పోలీ: విడువరా! బలవంతముగా తీసికొనవలసివచ్చును.

లక్ష్మి: మీ యిష్టము.

పోలీ: అటులనా? మీ రిక్కడనుండి పోవలెను.

భార: మా యిష్టమువచ్చినప్పుడు పోవుదుము.

పోలి: ఇప్పుడే కదలవలెను.

లక్ష్మి: మేము వెళ్ళము.

పోలీ: వెళ్లరా! ఇదుగో మిమ్ముల నరెస్టుచేయుచున్నాను. ఇక ఠాణాకు నడువుడు.

భార: సిద్ధము. మీ యిష్టమువచ్చిన చోటునకు తీసికొని పోవచ్చును.

పోలీ: అయిన నడువుడు.                    (నిష్క్రమింతురు)

★

రంగము ౧౧. (1936)

ప్రదేశము: సేవాగ్రామ సమీపము—ప్రవేశము: జవహార్‌లాల్

జవ: ఇక నెన్నటికి కోరిక తీరదుగదా!

ఉ. ఆరునె యెన్నడేని మన యాగటు? కల్గునె రక్తధార లిం
పారఁగ ధారవోసిన యపారపు సేవకునై ఫలంబు? చే
కూరునె భారతావనికిఁ గోరికపండ స్వరాజ్యలక్ష్మి? శో
భాకరమణీయమై యిక ప్రపంచసమాఖ్యను శీర్షమెత్తగా.

ఆహా! గాంధి – ఇర్విన్ సంధి కప్పుడే సంధికొట్టినది. కాంగ్రెసు టేబిలు సమావేశము కాంగ్రెసు టేబిలే యయినది. ఇక బ్రిటిషువా రొసఁగిన శ్వేతపత్రమా? అక్షరముల శ్వేతపత్రమే యయ్యెను.

ఔరా! గాంధీజీ దీక్షాపరత! హిందూసంఘమునుండి నిమ్నజాతులను వేఱుచేయు తలంపెట్టు బ్రిటిషురాజనీతి తంత్రముకు తన ప్రాణముల బలిగా నొడ్డి యా యాపదను నివారించెను. ఆ నాడా కఠోరమైన ఉపవాసదీక్షవలన బ్రిటిషు వారి యాటలు సాగలేదు. ఇక హిందూముస్లిముల సమస్యను పెద్ద చేయుచున్నారు పాలకులు. కానిమ్ము; గాంధిజీ యుండగా సాంఘిక సమస్య లేల పెరుగగలవు? కాని వీనివలన శాంతి యుద్ధము నిలిపివేయ వలసివచ్చెనుగదా? కానిమ్ము. ఈ 1935 సంవత్సరపు రాజ్యాంగప్రణాళిక మన యాశయసిద్ధికి దూరముగా నున్నను, ఎన్నికలలో పాల్గొనుటవలన కాంగ్రెసు శక్తి బహిర్గతము కాగలదు. ఈ నెపమున ప్రజానీకమునందు కాంగ్రెస్ ప్రచారము విరివిగా జరుగగలదు. యువ భారతము మేల్కొన గలదు. ఇక ఎన్నికల ప్రచారము సాగింతును.

(నిష్క్రమించును)

## రంగము ౧౨ (1936)

ప్రదేశము : జమీందారుని గృహము.

ప్రవేశము: జమీందారు, గుమాస్తా.

జమీ : ఏమోయ్! పరిస్థితి ఎట్లున్నది?

గుమా: బాబయ్యా! ఏమిచెప్పేది? కాంగ్రెసువారి ప్రచారము మిక్కుటముగా నున్నది. ఆ పాటలేమి? ఆ పద్యములేమి? ఆయూరేగింపులేమి? ఆయుత్సవములేమి? ఎచటజూచినను 'పసుపు పెట్టెలో ఓటు పడవేయుతల్లి!' 'రైతుకే ఓటీయవలె నన్నా' నీకష్టసుఖములు మనరంగకే తెలియునోయన్నా' అను పాటలె.

జమీ: దానికేమి. మనముమాత్రము తీసిపోవల దని చెప్ప లేదా? మీరేమి చేయుచున్నారు?

గుమా : మేముమాత్రము మూరకుంటిమా? కాంగ్రెసు సభలు జరుగు సమయమున ప్రక్కగా మన మీటింగుల నేర్పరచి తప్పెటలు మ్రోగింపచేసితిమి. సాధ్యమైనంతవరకు వారి మీటింగులు గలభాయగునట్లు చేసితిమి. అయినను జను లందరటే చేరుచుండిరి.

జమీ : సరేయో! నీకు చెప్పిన వ్యవహార మేమిచేసితివి?

గుమా : అదియా? వారు మిమ్ముల నొక్కసారి కనబడు మని చెప్పినారు.

జమీ : ఎన్నిసారు లెక్కడికని పోదును. తిరిగి తిరిగి విసుగు పుట్టుచున్నది. వెనుకటి రోజులలో కాకిచేత కబురుపంపిన అన్నివోట్లును దొరగారికే యనువారు. నేడో, నేనుపోయి

నను కనుపించరుగదా! ఒకవేళ కనబడిన 'సరే చూచెదము లెండి' యందురు. కొందఱు ప్రత్యక్షముగనే మీ రీ తూరి విరమించుకొను డని సలహా నిచ్చిరి. ఏమిచేయుదును? నేడు పోలింగు జరుగుచున్నది. పరిస్థితి యెట్లు కానున్నదో!

గుమా: అడుగో నండీ! మన యేజంటుగారు వచ్చుచున్నారు.

ఏజం: (ప్రవేశించి) నమస్కారము.

జమీ: ఏమోయ్! సంగతు లేమి?

ఏజం: ఏ మున్నదిస్వామీ! ఏ పోలింగుస్టేషనులో చూచినను పసుపుపెట్టెలు పట్టటం లేదు ఎఱ్ఱపెట్టెలలో ఏదియు లేదు. అన్నియు ఖాళీ.

జమీ. రాజధానియంతట నింతియేనా?

ఏజం: అవును, అంతట కాంగ్రెసుకే విజయము. తక్కినపార్టీలు నామరూపములు లేక నశించినవి.

జమీ: ఓహో! కాంగ్రెసుశక్తి! కాలము ననుసరించి నడుచుకొనవలెను. ధనికవర్గమునకు, పూంజీపతులకు నిఁక రాజ్యాంగములందు స్థానము లేదు. ఇక కిసాన్ మజదూర్ ప్రజారాజ్యమే నెలకొనగలదు. కాంగ్రెసునందు జేరి ప్రజాసేవచేయుటే కర్తవ్యము. పోదము రండు.

(నిష్క్రమింతురు)

★

రంగము ౧౩ (1939)

ప్రదేశము: బెజవాడ.

ప్రవేశము: ప్రకాశం, గిరి, గోపాలరెడ్డి,
యాకూబ్ హుసేన్, మునిస్వామిపిళ్లే.

ప్రకా: మనము మంత్రులముగా నున్న ఈ రెండు సంవత్సరములలో ప్రజలకే దేని యుపకారము చేయఁగలిగితిమో?

గోపా: సందేహ మేమి? ముఖ్యముగా జాతీయభావములు ప్రజలలో వ్యాపింపఁజేసితిమి. ఏ జాతీయపతాకము నీడ కాంగ్రెసు తన త్యాగమహిమను జూపెనో, ఏ పతాకము నకై పెక్కు రాత్మార్పణ మొనర్చిరో, ఏ పతాకము మన జాతీయత కేకైకచిహ్నమో, ఆ జాతీయపతాకము నేడు ప్రజాసంస్థలపై స్వేచ్ఛావిహార మొనర్చుచున్నది.

యాకూ: మనముచేసిన రైతుఋణనివారణ చట్టము బీద రైతుల నుద్ధరింపఁజేసినది.

గిరి: మద్యపానసిషేధచట్టము కార్మికులకు నైతికార్థిక విషయముల సహాయ మొనర్చినది.

ముని: హరిజన దేవాలయప్రవేశచట్టము హరిజనోద్ధరణకు మిక్కిలి దోహద మొసగినది.

ప్రకా: నిర్బంధహిందీవిద్యావిధానము, ఖద్దరు, చేనేతపరిశ్రమాభివృద్ధికొసంగు గ్రాంటులు మననిర్మాణకార్యక్రమమును విశదపరచుచున్నవి.

గిరి: కాని జమీందారీరైతుల దుస్థితి తొలఁగింపజాలకపోతిమి.

ప్రకా: అవును. అదియే నా మనసులోని యావేదన. ఉప
సంఘమువేదిక సిద్ధమైనది. బిల్లు ప్రవేశపెట్టదలచితిమి. కాని
యింతలో రెండవ ప్రపంచయుద్ధము వచ్చిపడినది.

గిరి: ఏడు కాంగ్రెసు రాష్ట్రములు నేకగ్రీవముగా బ్రిటి
షు వారి యుద్ధాశయముల వెలిబుచ్చుమని కోరినందు
లకు ప్రభుత్వము తప్పుదారిగా తప్పించుకొను సమాధాన
మిచ్చినది !

యాంకూ: పైగా కేంద్రశాసనసభనుగాని, రాష్ట్రప్రభుత్వము
లనుగాని సంప్రతింపకయే మన దేశమును యుద్ధములో
దించిరి. అభిమానముగల వారికి పదవులు విడుటయే కర్త
వ్యము.

గిరి: మంచిమాట! గౌరవమునిలుపుకొనుట కంతకంటె చేయ
దగిన దేదియు లేదు.

ప్రకా: మనము పదవులను విసర్జించి గాంధిజీనాయకత్వమున
యుద్ధవిషయమై కాంగ్రెసు సభిప్రాయమును తెలుపవలెను.

ముని: మన మీ పదవుల నంటిపెట్టుకొని కూర్చుండుటకు
వచ్చియుండలేదు.

యాంకూ: కాని ఒక్కవిషయముమాత్రము కొఱలిగా నున్నది.
ప్రత్యేకాంధ్రరాష్ట్రమును నిర్మించలేకపోతిమి.

ప్రకా: కారణాంతరములచే ససహాయుల మైతిమి. మరల
మంత్రిత్వములు స్వీకరించగలిగిన మన మొదటికృత్యమే
యిదియగుగాక! మనమందఱము రాజీనామాల నిత్తము.
రాబోవు శాంతివిప్లవసంధా అనుగమింతము. లెండు.

(తెరపడును)

# కాంగ్రెసు విజయము

## 3. ప్రజావిప్లవాంకము

(1940)

రంగము ౧. (1942 సెప్టెంబరు)

ప్రదేశము: పూనూరు. ప్రవేశము : పౌరులు

* విప్లవము కావాలి విప్లవము రావాలి
విప్లవజ్వాలలతో విశ్వమే నిండాలి
సామ్రాజ్యవాదంబు సమసిపోయేదాక
ధనికవాదంబింక దగ్ధమయ్యేదాక ॥వి॥
చెమటోడ్చి పనిజేయు శ్రమజీవు లేకమై
శ్రామికుల రాజ్యంబు స్థాపించునందాక ॥వి॥
శ్రామికుల దోచుకొని సుఖియించు సోమరుల్
విశ్వమున లేకుండ అస్తమించేదాక ॥వి॥
వర్గభేదాల్ పోయి ఉత్పత్తి సాధనాల్
వ్యక్తిపరమూ గాక సంఘపరమాదాక ॥వి॥
ఘోరదారిద్ర్యంబు కరువులూ కష్టాలు
యుద్ధాలు ఇవియన్ని అంతమొందేదాక ॥వి॥

---

* (క్రాంతిగీతాలు)

పా 1: ఓరా! విప్లవము-జాతీయ విప్లవము- ప్రజావిప్లవము-నివురుగప్పిన నిప్పువలెనున్న ప్రజలలోని విప్లవాగ్ని యొక్క సారి ప్రజ్వరిలించినది.

పా 2: అదిగో! ఎటుచూచినను మంటలు. స్టేషనులు, ఆఫీసులు మంటల పాలగుచున్నవి. తంతితీగలు తెగిపోవుచున్నవి. రైలుపట్టాలు పీకివేయబడుచున్నవి. రాకపోకలులేవు. వంతెనలు నాశన మైనవి. అంతట అరాజకము. అంతట స్వాతంత్ర్యము.

పా 1: ఓరా! ఆసేతుహిమాచలపర్యంత మొక్కటే తిరుగుబాటు. అయ్యయ్యో! ఆ చెలరేగిన ప్రజాసమూహములపై కాల్పులు జేయుచున్నారు. అబ్బా! ఎందఱెందఱో విద్యార్థులు తమ లేఁ బ్రాణముల నాహుతి జేయుచున్నారు. ప్రజలు త్రేజితు లగుచున్నారు కొన్నిచోట్ల ప్రజలనాపలేక విమానములనుండి జనసంఘములపై బాంబులు విసరుచున్నారు. ఓరా! ప్రజల కింతటి యావేశ మెట్లు వచ్చెనో గదా!

పా 2: ఎట్లు వచ్చెనందు వేమి? 1940 నుండి 41 వరకు కాంగ్రెసు ఈ యుద్ధమునందు తానవలంబించు వైఖరిని వ్యష్టిసత్యాగ్రహ మను పేర ప్రదర్శించినది. మాదేశమునకు సంబంధములేని యుద్ధమునకు మేము సహాయము చేయ మని ప్రత్యేకముగా వ్యక్తులు వెల్లడించి వేనకువేలు జైలుకు వెళ్లిరి. కాని ప్రభుత్వదృష్టియందు మార్పు రాలేదు.

పా 1: అందుకేనా బొంబాయిలో మొన్న ఈ 42 ఆగష్టు 8న

సమావేశమైన కాంగ్రెసు గాంధిజీ నాయకత్వమున 'క్విట్ ఇండియా' తీర్మానమును గావించినది?

పా 2: ఔను! 'క్విట్ ఇండియా' నినాదముతో శాంతియుతముగా మరల సర్వతోముఖసత్యాగ్రహమును జరుప గాంధిజీని సర్వసైన్యాధిపతిగా నొనర్చినది కాని, బ్రిటిషు వారీయుద్యమమును మొలకలోనే త్రుంచివేయ సంకల్పించిరి. 9 వ తేదీ అతిరథులనదగు వర్కింగు కమిటీ సభ్యుల నెల్ల నిర్బంధించి రహస్యస్థలమునకు గొంపోయిరి. కొందఱ మార్గమధ్యమున బట్టిరి. ఇతరుల నింట్లవద్దనుండగనే యరెస్టుచేసి జైలుకంపిరి. నేరము లేదు. విచారణ లేదు. అందరు డిటన్యూలే. కాంగ్రెసులోని నాయకు లందఱ నిట్లు బంధించిరి.

పా 2: అందులకే ప్రజలలో నావేశము పెరిగినది. మా నాయకు లేమైరని తిరుగబడిరి. ప్రభుత్వమువారు తెలుపకుండిరి. ఇంకేమి? క్రమశిక్షణతో నడుపగల నాయకుడు లేకపోయెను. కావున ప్రజలు హింసాహింసల లక్ష్యపెట్టక తమకు తోచిన విధముగ విజృంభించినారు.

పా 1: పాపము. కాంగ్రెసువారి నందఱను నిర్బంధించుటచే కాంగ్రెసు సమసిపోవు నని ప్రభుత్వము తలంచినది. కాని ప్రజలలోని స్వాతంత్ర్యపిపాసను గుర్తింప జాలకపోయెను. తన పశుబలముచే నేటి యీ తిరుగుబాటు అడపగలదు. కాని ప్రజల మనస్సులయందలి స్వాతంత్రతాక్షుధను మాత్ర మడంపజాలదు. నే డెవనినోట వినినను- 'క్విట్ - ఇండియా' (Do or Die) 'కరేంగే యా మరేంగే' 'యశోవా

మృత్యుర్వా' యను నినాదములే చెలరేగుచున్నవి. కానిమ్ము. ముందేమి కానున్నదో! పాప మహాకాంగ్రెసువారు జైళ్ళ యం దెట్లు గష్టపడుచున్నారో కదా! పోదము పద!

(నిష్క్రమింతురు)

★

రంగము ౨ (21-10-43)

ప్రదేశము: అలిపురం క్యాంపుజైలు.

ప్రవేశము: ఇరువురు రాజకీయఖైదీలు.

1; అబ్బా! వినాయకచవితినాడు 16 వ బ్లాకులో లాఠీ చార్జి చేయుటచే దెబ్బలు తిని మనవారు 'ఆసుపత్రి' జేరినారు. శరీరమందంతట దెబ్బలే!

2: దానికేమి? మొన్న నందివాడ హరిజనసోదరుడు చనిపోవుట మిక్కిలి విచారముగా నున్నది. పాపము మన సోదరులెందఱో ప్రాణములు వీడుచున్నారు. వారిశవములను పూలమాలలతో, బయటికి బంపు దృశ్యములు మఱపునకు రానివి. వారు స్వాతంత్ర్యముకొఱకు ప్రయత్నించి ప్రాణములు వీడిరి. అట్టి దేశభక్తులకు వీరపూజలు చేయుచున్నాము. తంజావూరు డెటిన్యూలక్యాంపులో మృతులగు సర్దార్ నారాయణరాజు,సుబ్బరాజుగార్లకు ఇట్లే చేసినారట. ఈ దేవశాపులుసుతో చలిలో నానా బాధలు పడవలసి వచ్చుచున్నది.

1: నీ వే భాష నేర్చుకొనుచున్నావు.

2: మా 17 వర్షాలలో అప్పారావు, వెంకట నరసయ్య అందరును హిందూస్థాని నేర్చుచున్నారు. రాష్ట్రభాషాసభల జరుపుచున్నాము. కొందఱు ఉర్దును, ప్రాంతీయభాషలను నేర్చుకొనుచున్నారు.

1: విద్యల నేర్చుకొనుట కిట మంచితీరిక లభించును. వృద్ధులు కూడ తమ మాతృభాషలను నేర్చుకొనుచున్నారు. పండితులు గాంధీపురాణములు చెప్పుచున్నారు. హరికథకులకు కొదువ లేదు. కవులు జాతీయకవితల నల్లుచుండ గాయకులు పాడుచున్నారు. భక్తులు ధ్యానమగ్నులగుచు శాంతముతో స్వరాజ్యదేవత నారాధించుచున్నారు.

2: అమ్మయ్య, సర్దార్ లచ్చన్నగారలు జాతీయవాదములను బోధించుచున్నారుగదా!

1: ఔను. సోదరా! నేనిట సాంఘిక, ఆర్థిక, రాజకీయాది సమస్యలలో మిక్కిలి విజ్ఞానమును సంపాదించితిని.

2: నీవే కాదు. అందఱు కర్మయోగులై విద్యాపరిశ్రమ నొనర్చుచున్నారు ఇదియొక విద్యాలయమైనది. క్రిమినలు ఖైదీలు మనల జూచి చదువుకొనుచున్నారు. సహకరించుచున్నారు. లోకమాన్యతిలక్, గాంధిజీ, రంగా, స్వామీ ఉన్నవ మొదలగు ప్రముఖులు గీతారహస్యము మాలపల్లి మొదలగు నమూల్యగ్రంథముల నిటనే వ్రాసిరి. చెఱసాలను కర్మయోగశాల జేసినారు.

1: అవును. అరువది దినములు నిరశనవ్రతముబూని ప్రాణములు వీడిన జతీంద్రుడును, గాంధిజీ మున్నగు దేశభక్తులు దీనిని త్యాగశాల జేసినారు.

2: మన యింట కష్టసహనము, సహయము సద్వినియోగము చేయుటను నేర్చుకొనుచున్నాము. చదువుచున్నాము. నూలు వడకుచున్నాము. మొన్న బాపూజీ ఇరువదియొక్క రోజుల ఉపవాసము విని దండియాత్రాపీరుడు ఎర్నేని సుబ్రహ్మణ్యము, కేశిరాజు అప్పారావు మున్నగువారు అన్నిరోజు లుపవసించి సఫలులైరి.

1: ఇంటినుండి నా కొక వార్త వచ్చినది. మా చెల్లెలు రాయవేలూరు జైలులోనున్నదట. స్త్రీలందఱు నట మనవలె విద్యలు నేర్చుచు నూలు కట్టు పరిశ్రమలు చేయుచు విజ్ఞానము సంపాదించుకొనుచున్నారట.

2: మంచిది. హిందూముస్లిము, అరవ ఆంధ్ర, మొదలగు మత జాతిభేదములు లేక భారతీయుల మను భావముతో సమైక్యతను జాటుచున్నాము. మాతృదేశసేవకై ఎట్టి కష్టముల నైన సహించుచు సర్వసమర్పణం జేయవలెను.

1: అదిగో బిగిలు మ్రోగినది. లాకప్ వేళ యైనది. పద పోదము. ఈ రాత్రి మంచి పుస్తకము చదివెదను. బ్లాకుకు పోవలెను.

(నిష్క్రమింతురు)

★

రంగము 3 (1944)

ప్రదేశము: సేవాగ్రామ సమీపము. ప్రవేశము : రంగా

రంగ : ఓరా! ఈ రెండుసంవత్సరములలో కాల మెంత తారుమారైనది. ప్రజలలో సంశయము లేర్పడినవి.

శా. కాంగ్రెస్ పేరును దాపుమాపుటకులోఁగాంక్షించి, సర్కారుచే
కాంగ్రెస్ వీరులు బందిచేయఁబడునా కాలంబు వీక్షించి, ఈ
సంగ్రామంబు ప్రజాపగంబనుచు నా సర్కారులో దూఱి, వే
సంగ్రామిణుల పార్టిపేరుల నయో! కావించిరన్యాయముల్

అభివృద్ధి నిరోధకరము లగు కొన్నిపార్టీలు సమయమును జూచి కాంగ్రెసుబలము నడఁచవలెనని తమ పార్టీ ప్రబోధమును గావించుకొనినవి. నిజమయిన కాంగ్రెసు ప్రచారము చేయు నాయకులు బయట లేనందున కాంగ్రెసు జ్యోతిని రక్షించుభారము నాడు విద్యార్థుల పైనను, రైతుల పైనను పడినది. (ముందునకుఁ జూచి) అదే సేవా గ్రామము! గాంధిజీని కలిసికొని కార్యవిధానము నాలోచింతును.

(నిష్క్రమించి రెండవవైపున ప్రవేశింపగా గాంధిజీ
రాట్నము వడకుచుఁ గానుపించును)

రంగ: మహాత్మాజీ! నమస్తే.

గాంధి: నాయనా! కూర్చుండుము. కుశలమా? భారతి కుశలమా?

రంగ: ప్రేమమూర్తీ! మీ యాశీర్వాదమువలన కుశలము. బ్రహ్మచర్యము, నిష్కామత్వము, సత్యము, అహింస, మీ జీవితసూత్రములు; పవిత్రులరు.

గాంధి: రంగా! నీ దేశసేవ దొడ్డది.

శా. రైతే కాంగ్రెసు, కాంగ్రెసే రైతుగా రైతాంగముద్ధార్ప నా
శీతజ్ఞాకర సేతుభారతిని రాశీభూతసోత్సాహివై
చేతోమోదము నొంది కర్షకులు రంజిల్లంగ బోధించి తో
స్నేత్ర గేసరి! రంగనాయకమణీ! నీ దీక్ష సామాన్యమే?

1921 నుండియు అఖిలభారతకిసానుసమస్యలయం దే శక్తి వినియోగించుచుంటివిగదా!

రంగ: అది తమ ఆశీర్వాదబలమేగదా! తమరు సర్వదా స్వర్ణస్వప్నముల గాంచు ఆ 'రామరాజ్య'మనిన రయితు కూలి ప్రజారాజ్యమేకదా!

గాంధి: నిజము. నిజము. రైతులశక్తి కాంగ్రెసు నం దంతర్భూతమైయున్నది. ప్రపంచ మంతయు పర్యటన మొనర్చి యింగ్లండు, జర్మనీ, ఇటలీ, ఫ్రాంసు దేశములందలి కిసాను సమస్యల గుర్తెఱింగితివి. అంతర్జాతీయరాజకీయా ర్థికపరిణామము అవగాహన మొనర్చుకొంటివి.

రంగ: బాపుజీ! 1938 లోనే తాము తమ సేవా పథమునందు సంపూర్ణముగా నడువగోరి నన్నాశీర్వ దించిరి. నా కప్పుడు అదృష్టములేక, మీ త్రోవనే మీ ఆశయానుసారము నడువలేకపోతిని. కాని, తమ పితృ వాత్సల్యప్రభావముచే ఈ నాడు నా యంతట నేనే మీ పంథా యందు జేరి, దానిని పెంచుకొనుచు బలపరచు కొను చుండు భాగ్యశాలి నైతి నని మీకు నివేదించుకొన సంతోషపడుచున్నాను. నేడు దేశమునందు స్వార్థపూరి తము లగు పార్టీలు తలచూపినవి. అవి జాతీయపంథాను బూటకముగా మలచినది. అంతర్జాతీయత యను మిషచే అన్యదేశ సిద్ధాంతముల ననుసరించుచు దేశకళ్యాణసంధాయకు లగు జాతీయనాయకులను వెక్కిరించుచున్నవి.

గాంధి: నాయనా! నేను తెలిపెడి నిర్మాణకార్యక్రమ మాచ

రించినచో దేశమందలి యేడులక్షల గ్రామములు, పట్టణ
ములు మరల కళాకాంతులతో కళకళ లాడగలవు.

సీ. ఖాదీపరిశ్రమ స్థాపింపవలె వృద్ధి
 మద్యపానంబును మాన్పవలెను
హిందు ముస్లిముల కింపొంద జేయుము మైత్రి
 అంటరానితనంబు మంటగలుపు
మహిళామణుల హక్కు మన్నింపఁగావలె
 ఆరోగ్యబోధ జేయంగవలెను
గ్రామపరిశ్రమ ల్గను వృద్ధి గావింపు
 పారిశుధ్యంబునుఁ బాటుపడుము

గీ. వృత్తివిద్య, వయోజనవిద్య గఱపు,
మమతనేర్పు హిందూస్థాని, మాతృభాష
పెడను, మార్థికసమత గావింపవలయు
కుష్ఠురోగుల నిలయముల్ కూర్పవలయు

గీ. రైతుకార్మిక కాంగ్రెసుల్ రంజిలగను
అడవిజాతుల బాగుకై పడుము పాటు
పూని విద్యార్థి కాంగ్రెసున్ పూన్పవలయు
ఇవియె గాంధిసూత్రములంచు నెఱుగవలయు

రంగ: ఆహా! అమృతప్రాయము. మీ ప్రణాళిక సాంఘికార్థిక
వైజ్ఞానికాది సమస్యలను చక్కగా పరిష్కరించును. అందు
మొదటిదియగు ఖాదీ పరిశ్రమ రైతులకును, రెండవది
యగు మద్యపాననిర్మూలన కార్మికులకును ముఖ్యతమ
ములు.

గాంధి: అవును. మన రాజకీయదాస్యము తొలంగుటకు మూడవదియగు హిందూ ముస్లిము సఖ్యతయే ప్రధానమైనది.

క. హిందూ ముస్లిము సఖ్యత
నెందును పాటింపవలయు హిందూదేశం
బందున; జాతీయైక్యతఁ
బొందక స్వాతంత్ర్యలక్ష్మిఁ పొందరు మనుజుల్

రంగ: అందుకు ముఖ్యముగా పరమసహనము, ఓర్పు నుండవలయును.

గాంధి: నిజము. మహమ్మదీయుఁడొకఁడు గోహింసచేయు ననుకొనుము. హిందువుఁడైనవాఁడు వానితో స్నేహముగా వాదించి, నచ్చఁజెప్పియే దానిని మాన్పించవలెను. గోహత్యల మాన్పుటకు నరహత్యలకుఁ బాల్పడు టెంత నైచ్యమో యూహింపుము. మనమందఱ మొకే భారతమాత పుత్రుల మనుమాట మఱువరాదు. మాట పట్టింపునకై దౌర్జన్యమునకుఁ బూనరాదు.

రంగ; నాల్గవదియగు అస్పృశ్యతానివారణ మత్యవసరమైనది! ఓ దేశీయులారా!

ఉ. ధర్మము ధర్మమంచును సదా వచియింతురు ధర్మపన్నముల్
ధర్మమునందు లేదె దయ? దగ్గఱ జేరగ ఛీ యటంచు పో
దుర్మతి దూరమంచు బహుదూషణచేయుటె ధర్మమానాకో
మర్మ మిఁకేలనయ్య దయమాలిన ధర్మము లున్నవే భువిన్॥

ఉ. చెప్పగరానివారు దరిఁజేరగరానియు వారటంచు మీ
గొప్పతనంబునే దలఁచి క్రూరముగా గనుచుందురయ్య తామో

తిప్పలు బెట్టగా నెట్టుల దీనుల భాగ్యవిహీనుల న్మనం
బొప్పెడి? తాతిగుండియ యె? ఓర్వగలారె సహోదరవ్యథల్

మహాత్మా! దానికి తమ జీవితమునే పణముగా నొడ్డితిరి గదా! ఇక నైనదవది మహిళాభ్యుదయము. అది ప్రాముఖ్యమగు సమస్యయే.

క. భారతమహిళాభ్యుదయము
సారెకు మదినెంచి వేగ సముద్ధూర్పవిచో
భారతమాతృక దాస్యము
తీరదు, విజ్ఞానధనము స్త్రీలకు కాదువో.

గాంధి: బాగుగా చెప్పితివి. తక్కిన గ్రామపరిశ్రమ, పారిశుధ్యము మొదలగు వానిని కార్యాచరణయందు చూపుచు స్వదేశోన్నతికై పాటుపడవలెను.

గీ. ప్రజల కాంగ్రెస్సు జేయుడీ రైతు కూలి
బాలయువజన విద్యార్థి వర్గ సంఘ
ములను స్థాపించి, లేకున్న మోద మలర
దేశస్వాతంత్ర్య మెట్లు ప్రాప్తించు మనకు॥

ఇన్నియున్నను తుద కార్థికసమత్వము లేకున్న మిగిలినవి సున్నయగును. కావున

గీ. ఆర్థికసమత్వమే లేని కన్నిటికిని
మించునదియుంచు మదిలోన నెంచవలయు
కుడువ గూడును, కట్టగా గుడ్డ లేని
బూటకపు స్వారాజ్యంబది బుగ్గిపాలు

రంగ: అట్టి యార్థికసమత బోధించునదే గదా సామ్యవాదము. రష్యాప్రభుత్వ మట్టి సమతాదృష్టి కలిగిన దేకదా!

మహాత్మా! మన దేశమందు భూస్వాముల, జమీందారుల విషయ మేమి?

గాంధి: జమీందారీ విధానము పెట్టుబడిదారీ విధానము తప్పక నిర్మూలనము కావలసినవే. మనము సామ్యవాదమును సౌమ్యవాదమున నమలుపఱతము. అందు నాకు విశ్వాసము గలదు.

రంగా: బాపుజీ! సర్వసంగపరిత్యాగులును; కర్మయోగులును, ఋషిపుంగవులు నగు మీవంటి వారి నాయకత్వమున నడుపబడు కాంగ్రెసుసంస్థ బూర్జువాసంస్థయనియు అభివృద్ధి నిరోధక సంస్థయనియు నిందించువారి నేమనవలెనో గదా!

సీ॥ * ధర్మమార్గంబున దశరథాత్మజురీతి
సత్యంబునను హరిశ్చంద్రు లీల
శాంతంబునను ధర్మజాతునివలె రాజ
కీయంబునందు శ్రీకృష్ణుబోలి
వరభూతదయకు శ్రీకరబౌద్ధుకరణిని
ఘనయోగవిద్య శంకరుని భంగి
క్షమయందు శ్రీ యేసుక్రైస్తవగురుపోల్కి
మతిదృఢంబున మహమ్మదు విధాన
గీ॥ వెలసియున్నావు నేటికి విశ్వమందు
నన్నియవతారముల శక్తి నందినావు
సత్యధర్మంబులను మాకొసంగుమయ్య
ప్రేమసంపూరితాత్మ గాంధీమహాత్మ!

* పాయం పరదదాను.

గాంధి: మీ రాష్ట్రమున నిర్మాణకార్యక్రమము జరుగుచున్నదా?

రంగా: మహాత్మాజీ! శాస్త్రిగారి వినయాశ్రమము, ఎర్నేని వారి గాంధియాశ్రమము, గుంటూరులోని కృష్ణాశ్రమము సర్వదా తమ కార్యక్రమమును సాగించుచునే యున్నవి. డా: మా కల్లూరిచంద్రమౌళిగారు కాంగ్రెసు ప్రచారకులను సంఘటన మొనర్చి రాష్ట్ర కాంగ్రెసు అసంబ్లీ అధ్యక్షులై కాంగ్రెసు వ్యతిరేకశక్తుల నన్నింటిని ధైర్యసాహసములతో నెదుర్కొనుచున్నారు. ప్రచారమును విరివిగ సాగింప నున్నారు.

గాంధి: మంచిదే. ఆంధ్రులు కార్యశూరులు.

రంగా: బాపూజీ! సెలవొసంగుడు.

గాంధి: శుభమగుగాక. వెళ్లిరమ్ము నాయనా..

రంగా: (నడచుచు తనలో)

గీ. గాంధి బాపూజీ యానతి కరముభక్తి
శిరమునందాల్చి స్వాతంత్ర్యసిద్ధికొఱకు
అఖిల దేశాల మేల్కొల్ప నరుగువాడ
క్రూరశత్రుగజంబుల గుండెలదర!

విద్యార్థి, కార్మిక, కర్షక, యువజన, మహిళా, చేనేత కాంగ్రెసు సంస్థల నెలకొల్పి కాంగ్రెసుశక్తి నినుమడింపం జేయుదును. (నిష్క్రమించును)

★

## రంగము ౮ (1945)

ప్రదేశము : ఢిల్లీ.

ప్రవేశము: వేవెలు, హోంమెంబరు. కమాండర్.

కమాం : ప్రభూ! సిమ్లా సమావేశ మిట్లు చెడిపోయిన దేమి.

హోం: అందాశ్చర్యమేమి? హిందూముస్లిముల కెట్లును పొత్తు కలియదు. మన రాజ్యమెట్లును స్థిరముగనే యుండును.

వేవె: మనము కుదరనిచ్చినగదా! అసెంబ్లీయందలి కాంగ్రెసు ముస్లిము లీగులవారు రాజీపడి చెరి యయిదు స్థానములు ప్రభుత్వమున తీసికొనుట కంగీకరించిరి. దానిని మనము హిందూముస్లిములుగా మార్చుటనే వ్యవహారము చెడుట తటస్థించినది.

కమాం: ముస్లిములీగు పార్టీ మనకు నిజముగా మేలునే చేయు చున్నది. వారి పాకిస్థాన్ పట్టుదల మనకు లాభకరము.

హోం: దానిని మనము తేల్చకూడదు. ఒకసారి పాకిస్థాన్ యొసగినట్లే మాట్లాడవలయును. మఱియొకతూరి అఖండ హిందూస్థానము నెడ సభిమాన మున్నట్లే చూపించ వల యును:

వేవె: కాని యీ యెత్తులు చాలకాలము కొనసాగజాలవు. మనము కాంగ్రెసు నడంచితి మనియే తలంచితిమి. కాని జైలునుండి విడుదల యయిన తోడనే మరల 'క్విట్ ఇం డియా' తీర్మానమును పునరుద్ఘాటించిరి. ఆ జవహారుల్ కి యమోఘమైనది. దేశము నాల్గు మూలలను సింహ గర్జనము చేయుచున్నాఁడు.

కమాం: ఈగర్జనల కేమిలెందు? ఇక్కే కాలహరణ మొనర్చుచుందుము.

వేవె; కాని జవాహరుని యంతర్జాతీయప్రతిభ యపారము.

హాం; ఏమైనను ఎలెక్షనులను గల్పించితిమిగదా! దీనితో కొంతకాలము జరుగును.

వేవె; కాని కాంగ్రెసువారు ఎలెక్షనుల కంటెను బోసు వీరుల విషయమునకు ప్రాధాన్య మొసఁగి దేశమునందు విప్లవ బీజములు నాటజూచుచున్నట్లు సంశయించుచున్నాను. మన దేశమందలి 'లాస్కీ' మహాశయుడుగూడ బ్రిటిషు వారు భారతదేశమునుండి వైదొలఁగుటయే కర్తవ్యమని చెప్పుచున్నాడు. ఏమి కానున్నదియో! లెండు పోదము.

(నిష్క్రమింతురు)

★

## రంగము ౫. (1945)

ప్రదేశము ; ఢిల్లీ.

ప్రవేశము ; జవాహర్, రంగా, సరోజినీ, ఖాన్‌సాహెబ్

జవా: ఔరా ! సుభాసువీరుని శౌర్యము.

సీ. ఎవ్వాఁడు ధీరత నేతాజి గాఁ బిల్చి
పరరాజగౌరవా ల్పతయు గలిగె
ఎవ్వాఁడు చతురుడై 'ఏషియా' యంతట
స్వాతంత్ర్యబీజముల్ చల్లగలిగె

ఎవ్వాడు ఘన 'అజాద్ హిందుఫౌజు'ను కూర్చి
వడిస్వతంత్రముగూర్ప నడువగలిగె
ఎవ్వాడు తను స్వరాజ్యేందిర వరియింప
మూపులం ధరియించి మోయగలిగె

గీ॥ అట్టి దేశసేవాపరాయణు నమేయ
శూరు సలఘు తేజు సుబాసు నేరమెంచ
జాలునెవ్వాడు భరతదేశంబునందు
వాడెపో దేశవిద్రోహి వాస్తవముగ.

భరతమాతదాస్యవిముక్తికిఁ బరదేశములందలి భారతీయుల సంఘటన మొనర్చిన వీరవరుని నామము సంస్మరించుటకైనను భారతావని నోచుకొనలేదా ?

రంగా ; పండిట్ జీ! ఔను. జయాపజయములు దైవాధీనములు. అతఁడే యాతని ప్రయత్నమున విజయుడైన మన మీనాటికి స్వతంత్రభారతమున నుండియుండెడివారమే గదా !

సరో: నిజము. మన స్వర్ణస్వప్నముల కొక యాకారమును కల్పించి భారతవీరులు స్వాతంత్ర్యప్రియులనెడి యశమును కల్పించెను. ఎవరైన కుమారులను కోరుకొమ్మని వరము ప్రసాదించిన బోసు వీరులనే పుత్రులుగా కోరుదును.

ఖాన్: అట్టివాఁడు దేశద్రోహి యెట్లగును ?

జవ: ఖానుజీ! సుబాసు దేశద్రోహి యను పలుకులు నా చెవుల వినలేను. అతని దేశభక్తి సాటిలేనిది. అచంచలమైనది.

రంగా: అవును. జపానువారి చేతికి జిక్కి వారి యాశయసిద్ధికి

కీలుబొమ్మ ప్రభుత్వము స్థాపించె నను వాదము దురహంకార పూరితమైనది.

ఖాన్: రంగాజీ! అవును. మనకు జేరిన భోగట్టా ననుసరించి జపానువారి కాతండెన్నడును లొంగలేదని తెలియుచున్నది.

సరో: భరతమాత దాస్యశృంఖలముల ఛేదించుటలో నెదురైన ప్రతిదేశమును, ప్రతిజాతిని ప్రతిఘటించుటయే రాజనీతిగా గైకొనిన వీరశిఖామణి.

జవ: నిజము. ఆతండు నిజముగా త్యాగమూర్తి. బ్రహ్మచారియై జన్మభూమికి సర్వస్వము నొసంగెను. ఆగ్నేయాసియా యందలి దూరప్రాచ్య దాస్యవిముక్తికై స్వతంత్రతాగ్నిని రగుల్కొల్పిన మహనీయుండు.

ఖాన్: కాకేమి? కెప్టెన్ షానవాజ్, కెప్టెన్ లక్ష్మిల బోలు మహాసేనానులు గల ఇరువది లక్షల స్వచ్ఛంద భారత సైన్యమును సేకూర్చిన నేతాజీ యాతడు కాదా?

సరో: అంతియేకాదు. స్వతంత్ర భారత ప్రభుత్వ స్థాపకుండై భారతరాజ్య సింహాసనాభిషిక్తుండయిన మొట్టమొదటి నేతాజి. హింసావిధానము మన కాంగ్రెసులక్ష్య మెన్నటికిని కాదు. కాని వారి దేశభక్తి కొనియాడదగినది.

రంగ: కాని, బోసువీరులను రాజద్రోహ నేరమునకు శిక్షింపం జూచుట విషాదకరము. ఇంగ్లండు పరాధీనమగుచో దాని స్వాతంత్ర్యమునకై ఆ పరరాజుతో పోట్లాడు తన దేశీయులను బ్రిటిషువారు రాజద్రోహము క్రింద శిక్షింతురా లేక దేశభక్తులని పూజింతురా?

జవా: అట్టివా రెన్నటికిని నేస్థులు కాజాలరు. రాజభక్తి కంటెను దేశభక్తి దొడ్డది. స్వార్థపరులు పరదేశముల కొల్లగొట్టి, వారిని పీడించుకొని తినెడి యుగము నశించినది. ఇది ప్రజాస్వామిక యుగము.

ఖాన్: పైన వారిపై హత్యానేరము లంటగట్టుటయా?

జవ: వారే హంతకులైన చేచేతుల మహాకాటకమును సృష్టించి బంగాళములో 1943 సంవత్సరమున తొబ్బదిలక్షల జనమును బలిగొనుటకు కారకులైన ప్రభుత్వోద్యోగులు మాత్రము హత్యానేరమునకు శిక్షింపఁబడవలదా?

ఖాన్: బాగుగ చెప్పితిరి. కాని నేఁడు న్యాయ మెచట కలదు.

రంగ: న్యాయ మేమున్నది. మన భారతమిత్రుఁడు లూయీ ఫిషర్ వ్రాసిన యుక[illegible]ము చదివితిమిగదా! అమెరికా యందు సాలునకు వేలకొలది ద్రవ్యమును వెచ్చించి భారతదేశవ్యవహారముల గప్పిపుచ్చుచు తప్పులతడకల ప్రచారము గావించుచున్నారట.

సరో: రంగాజీ! మన సోదరి విజయ అమెరికాయం దుండుట మనకు మేలే. ఆమె ప్రచారము వర్ణనాతీతము. ఆమె యచట లేకున్న భారతదేశ నైజస్వరూప మా విధముగా "సాన్‌ఫ్రాన్సిస్కో" సమావేశమునందు చిత్రింపబడదు.

జవ: విదేశ ప్రచారము మన కెంతేని ముఖ్యమగును. పతిత దేశములన్నియు తమ స్వాతంత్ర్యమును పునఃప్రతిష్ఠించుకొనుటకు సర్వవిధముల కృషిచేయునర్పవలెను.

రంగ: సంశయమేల? అదిగో ఇండోనేషియా, ఇండోచైనాల యందలి స్వాతంత్ర్య సమరములు గాంచుఁడు. పరాధీనుల

బోనటకై ఫాసిస్టుల నడచుటకే యుద్ధములు చేయు
చున్నామని ధర్మపన్నములు పలికిన సామ్రాజ్యవాదులు
యుద్ధవిజయులై తమ సామ్రాజ్యభాగముల సుస్థిర మొనర్చు
కొనిరి. అంతేకాక డచ్చి, ఫ్రెంచి సామ్రాజ్యములగూడ
నిలువబెట్ట బలప్రయోగ మొనర్చుచున్నారు.

జవ: ఔను రంగాజీ! చైనాలోని హాంకాంగును మరల తమ
యేలుబడిక్రిందకు తెచ్చుకొనినారు. బర్మా, సింగపూరుల
తిరిగి తమ సామ్రాజ్యమున కలుపుకొనినారు. ఫిలిప్పైన్సును
అమెరికావారు స్వాధీనము చేసికొనినారు. కాని ఆయా
దేశముల స్వాతంత్ర్యము మాట తలపరైరి.

ఖాన్; సామ్రాజ్యములను నిలుపుకొనుటకు చేసిన యీ
యుద్ధము ప్రజాయుద్ధమని మనదేశమందలి కమ్యూనిస్టులు
వాదన.

జవా: సరియే. అపార్టికిని, మనకును ప్రధానవిషయములందే
భేదముకలదు. మన మీ యుద్ధమును సామ్రాజ్యయుద్ధ
మన వారిది ప్రజాయుద్ధ మనుచున్నారు. మనము కోరు
నది సంపూర్ణప్రజాస్వామికము. వారు కోరునది పార్టీశా
మిక నియంతృత్వము; మనము వర్గసామరస్యమును కోరు
దుము. వారు వర్గపోరాటమును వాంఛింతురు.

ఖాన్: హిందూముస్లిము సఖ్యత విషయమునను వారి పంథా
వేరుగ నున్నది. మనము హిందూ ముస్లిం సమైక్యత
కోరుదుము. వారు కాంగ్రెసు ముస్లింలీగుల యైక్యత కోరు
దురు. మనము ముస్లిములు ప్రత్యేకజాతి కాదం
టాము. వారో ప్రత్యేకజాతి యనుచున్నారు. ప్లెబిసైటు

ద్వారా విభజన మనము కోరితే దేశవిభజన వారి జన్మ హక్కని వారందరు. మనము ప్రత్యేక నియోజకవర్గాలు పనికిరావంటే వారవి కావాలనుచున్నారు.

రంగ : నిజముగ ఈ పాకీస్థాన్ సమస్య అభూతకల్పన. దానికి యభివృద్ధి నిరోధక సంఘములు తాళము వేయుచున్నవి.

జవా : కాదా మరి! స్వయంనిర్ణయ సూత్రము ప్రాంతములకు వర్తింపజేతుమని మనము ఘోషించుచుండ దానిని మత ములవారీగా వర్తింపజేయుమనుట మూర్ఖత యగును. స్వార్థపరత యగును.

ఖాన్ : మాకు దేశముముందు, మతము తరువాత యని వేనోళ్ళ చాటుచుంటిమిగదా! ముందు దేశస్వాతంత్ర్యమును సంపా దింపవలెను.

రంగ : మహాశక్తివంతమగు 'ఆటం' బాంబును కనిపెట్టి రెండవ ప్రపంచ యుద్ధమున దిగ్విజయము గాంచిన వారు మన స్వాతంత్ర్యమును గుర్తింతురా?

సరో : అంతకు మించిన శక్తి, ఆత్మశక్తి మన దేశమున కలదు. ఆ శక్తి వలననే మన కాంగ్రెసుకూడ నేడు దిగ్విజయము గాంచినది.

రంగ : నిజము. క్రమశిక్షణకు లోనై సమైక్యతతో సంచ రించు కాంగ్రెసును నామరూపములు లేకుండ చేసితిమని బింకములు పలికినది బ్రిటిషు ప్రభుత్వము. అది యే మర తులు లేక మనల నడలు విడచి సంధిబేరమును సాగించు చున్నదిగదా ! ఇది మన విజయమే.

జవా: ఈ సంఘుల కింక మనము లొంగరాదు. మన నినాదము "క్విట్-ఇండియా" నుండి "క్విట్-ఏషియా" గా మారినది. సామ్రాజ్యవాద పిశాచమును ఆశియా ఖండము నుండి తరిమివేయవలెను. జై హింద్. రెండు పోదము.

(నిష్క్రమింతురు)

★

రంగము ౬. (1945 డిసెంబరు, 28)

ప్రదేశము : రాయలసీమలోని గ్రామము

ప్రవేశము : కల్లూరి సుబ్బారావు, కల్లూరి చంద్రమౌళి, ఓబులరెడ్డి, కోటిరెడ్డి, రత్నమాంబ, వలంటీరులు.

వలం: కీర్తన:

ముందుకు సాగిపోతామ్, కాంగ్రెసుకు
అందఱము వోటు చేస్తామ్ ॥ముందు॥
ఛేదించి పాలించకోయ్ వాలకా
భేదించి మమ్మేలకోయ్,
హిందు ముస్లిము క్రైస్తవుల్
అందఱూ మొక జాతివారమేనోయ్ ॥ముందు॥
వితనము చితుకగొట్టి రెండుగా
నత్తువా భూమిబెట్టి ఎంతగా
కొత్త యెరువులు వేసినా గింజమొల
కెత్తునా పిచ్చిబాబూ దేశాన్ని ॥ముందు॥
నత్తువా మారున్నదోయ్ జాతికీ
మత్తు వదలిపోయెనోయ్ కాంగ్రెస్సు

కత్తుమోయ్ మావోటులకే ఖజాన
పెత్తనము గైకొందుమోయ్ మాకే ॥ముందు॥
శాంతినీ స్థాపింతుమోయ్ లోకాన
క్రాంతినీ వెలయింతుమోయ్ గాంధిజీ
స్వాంతమున ధర్మజ్యోతికే దేశదే
శాంతముల వెలిగింతుమోయ్ ॥ముందు॥
బోలో స్వతంత్రభారత్ కీ జయ్

(అందఱు కూర్చుందురు)

వలం: నేటిసభకు శ్రీ కల్లూరి సుబ్బారావుగా రధ్యక్షత వహింప ప్రార్థించుచున్నాను. (మెడలో దండ వేయును. చప్పట్లు)

సుబ్బా: మహాశయులారా! నేడు సుదినము. మనజాతీయ కాంగ్రెసున కీనాటికి షష్టిపూర్తి రత్నోత్సవము అయినది. ఆ సేతుహిమాచల పర్యంతము జరుపుకొనుచున్నాము. ప్రపంచమందంతట జరుపబడుచున్నది. అరువదియొకటవ వత్సరము వచ్చినది. ఇది మనకు జాతీయపండుగ. స్వాతంత్రముకొరకై పోరాడు సంస్థయిది. మనత్యాగము లిందు ప్రతిఫలించుచున్నవి. ఇపుడు త్యాగపరీక్ష జరుగుచున్నది. ఎసంబ్లీ ఎన్నికలు రాబోవుచున్నవి. కాంగ్రెసుకే మీ వోట్లనిచ్చి విజయమును పొందుడు. కల్లూరి చంద్రమౌళి గారు త్యాగమూర్తులు. వా రుపన్యసింతురు.

చంద్ర: అధ్యక్షా! సోదరసోదరీమణులారా! ఓట్లతిరునాల వచ్చుచున్నది. కాంగ్రెసుప్రభలతో స్వారాజ్యతీర్థములైన పోలింగు స్టేషనులకు బయలుదేరుడు. కాంగ్రెసువారి

కిచ్చిన ప్రతిఓటు పురుషోత్తముడైన శ్రీగాంధి మహాత్ముల వారికి భక్తితో సమర్పించిన కానుక. మీ ఓట్ల మాలను గాంధిదేవుని కంఠమున నలంకరింపుడు. ఇది గొప్పపరీక్షా సమయము. భారతీయులలో స్వరాజ్యతృష్ణ మిక్కుటమైనదని చాటవలసిన సమయము. ఓటర్లలో కాంగ్రెస్ తత్వము ఏమాత్రముండునో చూచెదనని ప్రభుత్వము సవాల్ చేసినది. జాతీయకాంగ్రెసు ఆ సవాలును స్వీకరించినది. భరతమాత మీ హృదయముల జొచ్చి తన యాత్మగౌరవమును నిలుపుకొనుగాక! కావున ఓటింగు రోజున భూనభోంతరాళములు బ్రద్దలగునట్లు కాంగ్రెసే భారతీయులు, భారతీయులే కాంగ్రెసను జయజయధ్వానములు చేయుచు పసుపుపెట్టెలయందే మీవోట్లను పడవేయ ప్రార్థించుచున్నాను.

(బ్యా: కడప కోటిరెడ్డిగా రుపన్యసింతురు.

(టీ: గత60సంవత్సరములనుండి కాంగ్రెసు చేసిన సేవ నిరుపమానమైనది. కాంగ్రెసుపై ప్రజలకుగల విశ్వాసమువల్లనే ప్రజలకది సేవ చేయ గలుగుచున్నది. 1942 సంవత్సరమునుండి కాంగ్రెసు అజ్ఞాతవాసములో గడపినది. అదిగో నైతిక విజయము చేకూరినది. దానిపై ప్రభుత్వము వారి యినుప పిడికిలి సడలినది. మరల కాంగ్రెసుశక్తి విజృంభించినది. నాయకులు విడుదలయిరి. అదుగో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నాయకుడు ఆంధ్రకేసరి,

మ. కనుగొమ్మల్లదె యాంధ్రకేసరి మహోగర్జారవంబు ల్సెలం
గను హుమ్మంచుపాటుబాపుటిస్వాడలిదిగ్దంతావళుల్ భీతిలన్
మన యాంధ్రావని సంచరించెడిని రాజ్మార్గంబులన్ శేవన్నై
వినరా వింకను శ్రుత్రజాతులతి గర్వీభూత నీచార్భటుల్.

ఇంక మనమందఱము నిర్మాణాత్మకంగా కృషిచేయ వలెను. ఓ మహాశయులారా! ప్రజల నిత్యజీవితావసరములలో గలుగు కష్టనష్టములు తొలగడానికి పార్టీ విభేదాలు మరచి హిందూముస్లిములందఱు సమైక్యతతో కాంగ్రెసుకే వోట్లనిచ్చి సంస్థను బలపరచుతు.

సుబ్బా: ఓబులరెడ్డిగా రుపన్యసింతురు.

ఓబుల: సోదరులారా! బెంగాలుకరువు వంటి హృదయ విదారకమైన కరువులు మన దేశమునకు రాకుండ చేయవలెను. దొంగమార్కెట్లు పోయి ప్రతిగ్రామమునందున ఆహార కమిటీలు సవ్యంగా పనిచేయవలెను. రైతుల కూలీల స్థితులు చక్కబడవలెను. అందునకు త్యాగమూర్తులవసరము. అట్టి వారు శాసనసభల నలంకరించవలెను. అదిగో పోటీలేకయే కేంద్రశాసన సభ కెన్నుకొనబడిన రైతు నాయకుని గాంచుడు.

సీ. ప్రొఫెసరు పీఠంబు ప్రాతుంగ్గా విడనాడి
దేశీయసేవలు దిద్దినాడు
పాశ్చాత్యదేశాల ప్రౌఢిమై విహరించి
గాంధీయ బోధలన్ గఱపినాడు

శ్రీకిసాన్ కాంగ్రెసుగ జెచ్చెర స్థలకొల్పి
జాతీయ ధర్మంబు సలిపినాఁడు
సర్వస్వమును దేశ సంసేవకై వీడి
త్యాగవైరాగ్యముల్ దాల్చినాఁడు
గీ. తెనుఁగు గడ్డకు కీర్తిని దెచ్చినాఁడు
అఖిలభారతనేతయై యలరినాఁడు
కూరశత్రుగజంబుల గూల్చినాఁడు
రైతునాయకుఁడగు యన్. జి. రంగబాబు!

ఇట్టి త్యాగశీలురు, దేశసేవాధురంధరులు గలిగి, అతి పవిత్రుడగు శ్రీ గాంధీజీచే నడుపబడు కాంగ్రెసుకు మీ రెల్లరు వోట్లు నొసంగి బలపరచుట మీ విధి. మహాత్ముడు 1919 ఏప్రిల్ ఆరున రౌలట్ శాసన సత్యాగ్రహ మను పేర మొదటి అఖిలభారతోద్యమమును 1920 ఆగష్టు ఒకటిన అసహాయోద్యమము మను పేర రెండవ అఖిల భారతోద్యమమును 1930 మార్చి 12 న ఉప్పుసత్యాగ్రహ మను పేర మూఁడవ అఖిలభారతోద్యమమును లేవదీసెను. ఆగష్టు విప్లవము ప్రజాందోళనా ఫలితము. కాంగ్రెసుబలమే మీ బలము. మీ బలమే కాంగ్రెసు బలము.

సుబ్బా: దేశసేవా పరాయణి శ్రీమతి ఉప్పుగంటి రత్నమాంబగారు మాట్లాడుదురు.

రత్న: తల్లిదండ్రులారా! కాంగ్రెసు సంస్థ అఖండ శక్తివంత మైనది. అరువది వత్సరముల దివ్యచరిత్రగలది. కాంగ్రెసు మూలముననే స్వాతంత్ర్యము సంపాదించగలమను సత్యము 42 ఆగష్టు విప్లవమువలన తెలిసినది. ఇతర పార్టీలు

ఆంధ్రాలో సాగించు విషప్రచారమును జూచి మోసపో వలదు. సరోజినివంటి ఆదర్శ మహిళల బోధల వినుడు. ఎంతోకాలము దేశము బానిసత్వములో నుండజాలదు. సామ్రాజ్యవాదశక్తులు, ఆసియాలోని ప్రజా స్వాతంత్ర్య ఉద్యమాలను నాశనం చేయుటకు తీవ్రకృషి చేయుచున్నవి. ప్రపంచమును రక్షించుటకు స్వతంత్రభారతమే అద్యతనభావిలో నాయకత్వము వహించవలెను. కావున ఈ ఎన్నికలలో మీరందఱు పసుపు పెట్టెలయందే మీ వోట్లను వేసి సామ్రాజ్య వ్యతిరేక పోరాటమునకు సన్నద్ధులు కండు.

సుబ్బా : మోరి బృందమువారు ఎన్నికల ప్రణాళికను బుఱ్ఱ కథగా జెప్పెదరు.

## ఎన్నికల బుఱ్ఱకథ

1 కాంగ్రెసు సంస్థకు భరతఖండమున – కలుగునండిజయము
కాంగ్రెసు సంస్థకె వోటు నొసంగిన – కలుగుకె స్వారాజ్యము
2 స్వతంత్రభారత ప్రజాస్వామికమె – స్థాపిత మౌనండి
మతంబుల, జాతుల, వర్గసమైక్యత – మహిని వెలయునండి
3 ఎక్కువతక్కువ వర్ణభేదములె – యెగిరిపోవునండి
లెక్కకురా విక వర్గభేదములు – లేచిపోవునండి
4 ప్రతిపౌరునికీ సమానసత్వాల్ – ప్రతిష్ఠింపబడును
ప్రతియొకనికి సమానావకాశాల్ – ప్రసాదింపబడును
5 పురోభివృద్ధికి యవకాశంబులు – పూర్తిగనుండునయ
నిరాటంకముగ ప్రతిభనుజూప – నేరముండదయ్య

6 ప్రాంతములన్ని విశాలభారతిని – భాగస్వాములేను
స్వాంత సంస్కృతిని పెంపొందింప – సర్వహక్కులూను

7 భాషాప్రయుక్త రాష్ట్రంబులుగా – భాగింపగనగును
వేషభాషలూ మతానుసారము – వేసికొనంగవగును

8 సాంఘిక వ్యవస్థలో నిరంకుశత్వము – సాగబోవదయ్యా
సంఘములోనివారి హక్కులు – సరిగ జూడుడయ్యా

9 స్వయంనిర్ణయసూత్రమె కాంగ్రెసు – చరమలక్ష్యమండీ
స్వయంపరిపాలన రాష్ట్రంబులకు – చాల గలుగునండీ

10 వివిధరాష్ట్రములు సమైక్యతనొంది – ఫెడరల్ రాజ్యంబు
యువభారతమున స్థాపింపదలంచు – టొక్కటె లక్ష్యంబు

11 భారతదేశపు దారిద్ర్యంబును – బాపవలెను నిపుడు
పౌరజీవిత ప్రమాణవృద్ధికి – పాటుపడుద మపుడు

12 నవ్యసాధనల నుత్పత్తులనే – నాణెంబుగ బెంచి
సవ్యంబౌ ప్రజాధిపత్యంబున – సంపదలను యుంచి

13 సహకారవిధానావలంబనను – సంపద లందఱకు
బహుళ తరంబుగ పంచిపెట్టుటయే ? ధ్యేయమగును మనకు

14 స్వాతంత్ర్యంబును పొంది ప్రపంచపు-సర్వరాజ్యములను
చేతోముదమున సమాఖ్యయగుచో – చిరవాంఛిత మిలను

15 సామ్రాజ్యవాదము ప్రపంచంబున – సమసిపోవవలెను
సామ్రాజ్యతృష్ణయు లోకమునందు – శాంతినొందవలెను

16 ప్రజారాజ్యములె ప్రపంచమంతు – వర్ధిల్లగవలెను
ప్రజాకోటికి కూడుగుడ్డలు – ప్రాప్తించగవలెను

17 కాంగ్రెసుసంస్థకె వోటునొసంగుడు – కలుగును చిరయశము
కాంగ్రెసు సంస్థకు భరతఖండమున – కలుగు దిగ్విజయము

18 త్యాగశీలురకు నిలయమైనది - ధరణిలో కాంగ్రెస్సు
భోగవర్జితుల కాకరమైనది - భువిలో కాంగ్రెస్సు

19 కోటులాదిగల ద్రవ్యమంతయును - కోరివిడచినారు
ధాటినిచ్చు నుద్యోగంబులనే - తన్ని వేసినారు

20 స్వరాజ్యసిద్ధికి ప్రాణంబులనే - సమర్పించినారు
శరీరంబులను చెఱసాలలకే - సమర్పించినారు

21 భరతమాతకై భగవత్సింగు - ప్రాణమొసగినాడు
తరుణజతీంద్రుడు జైలులోననే - తనువువీడినాడు

22 హిందూముస్లిము లొక్కరొకరిని - హింసించుచునుండ
పొందుగ వీర గణేశు డడ్డుపడి - పోరునాపుచుండ

23 కత్తిదెబ్బచే నాతండపుడే - కాయము బాయుటలో
చిత్తమునందున నిరుపక్షాలకు - సిగ్గు వచ్చెనటుల

24 హరిజనదీనావస్థల గాంధీజి - ఆలకించినాడు
తరుగని చింతాక్రాంతుండగుచు - తల్లడిల్లినాడు

25 ఇరువదిరోజుల నుపవాసంబూ - ఇలను జేసినాడు
పరువుగ వారలహక్కులు నిలిపి - ప్రకాశించినాడు

27 వాడలలోనీ హరిజనులందఱు - నరలుచు నుందు రిక
కూడూగుడ్డా. విద్యాధనములు - కొల్లలు వారి కిక
రైతూ కూలి ప్రజారాజ్యంబు - రహితో వెలుగొందు
పూతయా భారతమాతృజ్యోతీ - పుడమిని నుతినొందు

28 విద్యవిజ్ఞానారోగ్యంబులును - విలసిల్లును భువిలో
సద్యశముగల్గును జన్మభూమికి - జాతీయసమితిలో

29 జమీందారీరైతుల పరిస్థితి - చక్కబడును త్వరగ
క్రమంబైనా భూమిపన్నులింక - కట్టబడును సరిగ

30 గ్రామస్వరాజ్యమె స్థాపితమౌను । గ్రామసీమలందు
రామరాజ్యమే వెలయును భారత । రాజ్యంబునందు

31 పల్లె పల్లెకును తపాలసౌఖ్యము । బాగుగ నీబడును
కల్లుదుకాణములన్నియుగూడ । కట్టివేయబడును

32 రాకపోకలా సౌఖ్యములికపై । రయమున పెంపగును
చీకుచింతలులేని బ్రతుకులు । చెలువుగ గననగును

33 అక్షరాస్యతా దేశమునందున – వ్యాప్తినొందగలదు
కుక్షింభరులా దుర్మార్గం బిక – కుములుచు పోగలదు

34 నిర్బంధోచిత ప్రాథమికవిద్య – నిజముగ వ్యాపించు
దుర్బోధావళి యొక్కపెట్టునను – తొలఁగియె నశియించు

35 మహిళల కోర్కెలు సర్వవిధంబుల – మన్నింపఁగబడును
బహువిధములగల స్త్రీల హక్కులు – ప్రతిష్ఠింపబడును

36 అన్నియూరులా ధర్మచికిత్సకు – ఆసుపత్రు లమరు
సన్నుతికెక్కగ వికలాంగుల కిల – సత్రంబులు దనరు

37 బొఱ్ఱలు పెంచెడి భూస్వాములకు – పొలముతేల దక్కు
కఱ్ఱులుబట్టెడి కష్టజీవులకె – కలుగు పొలముహక్కు

38 పల్లెలలోపలి ద్రవ్యరాసులను బస్తీదాడులకు
కొల్లగొట్టగా నీయకుంటయే కోరిక కాంగ్రెసుకు

39 వ్యవసాయ వస్తువు లన్నిరైతుల కందఱికును వేగ
అవసరముగ నందింపగబడు నిక నన్యాయము లేక

40 కండలుపెంచెడి మిల్లుదొరలకు – కలుగబోదు సుఖము
కండలు చెండెడి శ్రామికజీవికె – కలుగు ధనము యశము

41 పాడిపంటలూ సమృద్ధిగ గలిగి – భారతవర్షంబు
మూడులోకముల కీర్తివంతమై – మురియుట తథ్యంబు

42 నందడి జేయుచు స్వరాజ్యలక్ష్మి - సంచరించుచునంది
అందఱు జేరి కాంగ్రెసురథమూ - అదిగో లాగండి

సుబ్బా: నేటికి సభ ముగిసినది.

(అందఱు లేచిపోవుచు కీర్తన పాడుదురు)

వలం: కీర్తన.

వోటియ్! వోటియ్! కాంగ్రెసుకూ
పోటీపడకోయ్! కాంగ్రెసుతో ॥వో॥
కడుపునిండా కూడు - కావాలంటే
ఒడలినిండా గుడ్డ - కావాలంటే ॥వో॥
తడియకుండా కొంప - కోరావంటే
జడియకుండా నుండ - కోరావంటే ॥వో॥
రయితురాజ్యమే - రావాలంటే
బయటిపెత్తనమె - పోవాలంటే ॥వో॥
పయిరుపంటలే - పెరగాలంటే
జయము ప్రజలకు - కలగాలంటే ॥వో॥

(నిష్క్రమింతురు)

## రంగము ౭

ప్రదేశము: సేవాగ్రామము.

ప్రదేశము: గాంధి, అజాద్, నెహ్రూ, విజయలక్ష్మి,
ట్రూమన్, లాస్కి., స్టాలిన్, జంగ్‌కైషేక్.

లాస్కి: నేటికి ప్రపంచ సమాఖ్యను నెలకొల్ప గలిగితిమి.
సంతోషమయినది.

ట్రూమన్ : అన్ని దేశములు స్వాతంత్ర్యమును పొంది శాంతి అభ్యుదయములతో సౌఖ్యముగా నున్నవి.

స్టాలిన్ : సామ్రాజ్య వాదము నేటికి నశించి ప్రజాస్వామిక పరిపాలన సుస్థాపితమైనది.

జంగ్ : గాంధీమహాత్ముని యహింసావిధానమే శాంతిని నెల కొల్పి; విశ్వమానవకల్యాణమును చేకూర్చినది.

గాంధి : నా మనోవాంఛితము నేటికి కీడేరినది.

నెహ్రూ, లాస్కీ, లూయీఫిషరుల వంటి మిత్రుల నైతిక ప్రచారము మనకు మిక్కిలి తోడ్పడినది.

అజాద్ : జాతిమతకక్షలు నశించి సర్వమానవ సౌభ్రాతృత్వ మేర్పడినది.

విజయ : గాంధిమహాత్ముని యమోఘశక్తివలన శాంతి, సుఖ ములు సమకూరినవి.

లాస్కీ : ఆత్మశక్తి యమోఘమైనదని ప్రపంచము నేటికి గ్రహింప కలిగినది.

సర్వేత్ర సుఖినః సన్తు సర్వే సన్తు నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్ దుఃఖ మాప్నుయాత్॥

[మంగళ హారతి పాడుదురు.]

ఓం శాంతిః

రసతరంగిణి ముద్రాక్షరశాల బెజవాడ

# సమర్పణము

పార్థివ సం॥ర పుష్య శు ౪ సోమవారము (21-1-46) గాంధిజీ బెజవాడకు వచ్చినపుడు మౌనవ్రత సందర్భమున వారికి ప్రేమతో సమర్పింపబడినది.

ఇట్లు

రచయితలు.

